# పండరి మజిలీ కథలు

(అను)

## పాండురంగ మహాత్మ్యము.



గ్రంథకర్త:

యిర్రి వెంకటాద్రి

నరసరావుపేట.

1939.

# విజ్ఞప్తి

భక్తాగ్రేసరులారా !

నేనీ చిన్నగ్రంధమును వ్రాయగల్గిన భాగ్యము నేటికబ్బి నందుల కెంతయు సంతసించుచున్నాడ. నేను విద్యార్థినై యుండగను, తదుపరియు, కని, విని, చదివిన కథలననుసరించి నా స్వపోహానలన నీ పాండురంగ మహాత్మ్యము వ్రాసితిని. పండరిక్షేత్రమును నేను స్వయముగ, ననేక పర్యాయములు దర్శించినందున నాకు తెలిసి నంతవరకు పుండరీకాక్షపురమును వర్ణించితిని.

అన్యుల సహాయ్యము లేక నేనీగ్రంధమును వ్రాసి యుంటిని. మరియు, నేనెన్నడును పుస్తకములను వ్రాసియుండలేదు. కవిత్వ మునకునూ నా యీ పుస్తకమునకును సంబాధము లేదు. యీకథా భాగములు శులభశైలిని వ్రాసినందున ప్రతివ్యక్తియు త్వరగా నర్థము చేసుకొనగలడని నాముఖ్యోద్దేశ్యము. మహానుభావులగు కవిపుంగవు లిందు అనేకతప్పులు కనిపెట్టవచ్చును. కానిదయార్ద్ర హృదయులగు నాయాంధ్రకవులు వానిని నాకు తెలియపరచినచో అపరిమితానంద వినయ విధేయతలతో స్వీకరించి మరుప్రచురణ యందు సవరించుకొందును.

యీ కథాభాగము లన్నియు, కేవలకల్పితములు యిందు ప్రత్యేకవ్యక్తుల పరామర్శ యేమాత్రమును లేదు.

తదుపరి "పండరిమజిలీ కథలు" రెండవభాగమును వ్రాయు చున్నాను. స్వల్పకాలములోనే నదియు ప్రచురింపబడును.

గ్రంథకర్త.

# అభిప్రాయము.

నేను యీ గ్రంథకర్తను కొంత కాలమునుండి యెరుంగుదును. వయస్సున చిన్నవాడయ్యు, మాతృభాషయందు విశేషపరిచయము గలవారిలో నొకరని చెప్పుట కెంతయు సంతసించుచున్నాడ. గ్రంథములను వ్రాయుటలో యిదియే నూతనమయినను, చాకచక్యముగ నీపాత్రమును పోషించుట కర్హుండని చెప్పగలను.

మున్ముందు మాతృభాషయందప్రమత్తుఁడై మెలంగగలడని ఘంటాపథముగ తెల్పుట కీవ్యక్తి తెలుగు పత్రికాలేఖనమే యాధార భూతము.


నంద్యాల, 1—6—'39

యస్. సీతారామయ్య, బి. ఎ., యల్. టి.,
మ్యునిసిపల్ కమీషనర్.

శ్రీరామజయం.

# పండరి మజిలీ కథలు

(అను పాండురంగ మహాత్మ్యము)

(మొదటిభాగము.)

———.(o):———

ఇప్పటికి షుమారు నూట యాబది సంవత్సరముల
పూర్వము మన యాంధ్రరాష్ట్రములో నొకభాగమైన కృష్ణానదీ
తీర ప్రదేశమంతయు, ఇప్పుడు నైజాం రాష్ట్రమని యొప్పారుచున్న
నిజాం రాష్ట్రమునకు చెందియుండెను. ఆకాలములో యిప్పటివలెనే
ఆంధ్రదేశములో కొంతభాగము మహమ్మదీయ పరిపాలనమునకు
లోబడియుండెను. ఈకృష్ణా నదీతీరము సహితము తురుష్క
రాజుల పరిపాలనము క్రింద నుండెను. ఆ ప్రదేశములో రాజు
తురుష్కుడైనను, యపరిమిత శాంత భరితుడును, ధర్మపరిపాలనా
దురంధరుడునై, రాచ కార్యములను చక్కగ నిర్వర్తించు
చుండెను. ఆకారణమువలననే సకాలమునకు సమృద్ధిగావర్షములు
కురియుచూ సమస్త తినుభండారములు పుష్కలముగా ఫలించు
చుండెను. ప్రజలు తమ యేలికంబోలె ధర్మవర్తనులై దైవభక్తి
పరాయణులై వర్తింపుచు రాజున కెంతయు, సంతసముం గూర్చు
చుండిరి. రాజునకుత్సాహము హెచ్చుకొలది మతబేధ మనునది
సంపూర్ణముగా వదలినది. హిందూస్థాన ముఖ్యస్థానములం దచ్చో
టచ్చోట వారివారి కోరికల ననుసరించి గొప్పగొప్ప దేవాలయ

ములను కట్టించుకొనుటకు ద్రవ్యసహాయ మొనర్చు చుండెను. తన స్వమతస్థులగు మహమ్మదీయులకు సహితము అన్ని ముఖ్య స్థానముల యందు మసీదులను కట్టించు చుండెను. ఇంకనూ బ్రిటిష్ పరిపాలన హిందూదేశమునందు విశేషముగ వ్యాపించ నందున క్రైస్తవమత మంతగా మనదేశమునందు వ్యాపించియుండ లేదు. అందువలననే క్రైస్తవులు తమకు క్రీస్తుదేవాలయములను (చర్చీలను) కట్టించుమని రాజును కోరిన వారు లేని లోభము చేత నట్టి కట్టడములను తమ నిజాం రాష్ట్రమునం దెచ్చటను ఆకాల ములో కనుపించినట్లు కనబడదు. రాజు అన్నిమతములయం దభి మానముగలిగి అక్బరు చక్రవర్తిని మరపించుచూ ప్రజల కత్యం తోత్సాహముగా పరిపాలన చేయుచూ, అన్నిమతముల వారికినీ ఆయా పరిపాలనా శాఖలయందు నున్నతో ద్యోగముల నిచ్చు చుండెను. హిందువులు సహితము రాజభాషయగు ఉర్దుభాష యందు మంచిపాండిత్యమును సంపాదించి గొప్ప వుద్యోగములను సంపాదించిరి. ఆయాచార మిప్పటికినీ నిజాంరాజ్యమును విడువ కుండా ప్రతిహింనువుడునూ వారి రాజభాషయగువుర్దుభాషయందు పరిచయము గలిగి చరింపుచున్న సంగతి యెల్లరకు విశదమై యున్నది.

అట్టి నిజాం రాజ్యములో క్రిష్ణగిరియను నొక చిన్న గ్రామ ముగలదు. ఆగ్రామములో యిప్పటివలెంగాక బ్రాహ్మణులు సద్ధ

ర్మాను వర్తనులును, దైవభక్తి పరాయణులై వర్తింపుచుండిరి. క్షత్రియులు ఆయా దుర్గమ ప్రదేశములయందు చరింపు దుష్ట మృగములను తమ భుజపరాక్రములచే సంహారించుచు ప్రజల కెంతయు, నిర్భయమును గూర్చుచుండిరి. వర్తకులు నిత్య సత్య వ్రతులై తమతమ వ్యాపారములయందు వేలుగడించిరి. శూద్రులు చక్కగ కృషిసల్పి సమస్త ధాన్యములను పుష్కలముగ ఫలింపం జేయుచుండిరి. పంచమకులజులు తమ కగ్రజాతుల కనుమతముగా వారివారి కులవృత్తులయం దప్రమత్తులై మెలంగుచుండిరి. రాజు, సత్యానా క్షపరిపాలకుడును, ఏకపత్నీ వ్రతుడును, సత్పరిపాలనా దురంధరుడును,భూతదయాళుండునై నందున, రాజమతస్థులగుతురు ష్కులు సహితము శాంతమూర్తులై తమకు ముఖ్యగ్రంధమగు ఖురాన్ చదివిన వినుటయం దాశక్తులై గోవధ యనునది సంపూ ర్ణముగ మానివైచిరి. యిట్టి సమస్త వైభవములతో తులదూగు చుండి రామరాజ్యమునోలె యీ నిజాంరాజ్యమునకు చెందిన కృష్ణగిరిలో జార, చోర, వ్యాధి, భయములు లేక జనులు సర్వవి ధముల సుఖించుచుండిరి. అట్టితరి నీభూలోక కైలాసంబగు కృష్ణ గిరియందువిజయవర్మయను నొకబ్రాహ్మణవర్యుడు, సార్థకనామ ధేయమగు సుభద్ర యను నొక పుణ్యాంగనఁజేపట్టి బహు కాలమునుండి సంసారసుఖ మనుభవించు చుండెను. విజయవర్మ బీదలపాలిటి కల్పతరువు. మరియు బీదగోవులపాలిటి ధర్మదేవత యై నిరంతరము విష్ణుభక్తి తత్పరుడై మెలంగుచుండెను. సుభద్ర

సహితము భర్తచేయు చేష్టల కనుమతముగా, ఆయన యొనర్చు సత్కార్యముల కెంతయు నుబ్బుచు, భర్తకు సమస్త నుపచర్యలు సల్పుచు, తనస్వామి కెంతయు నానందము గూర్చుచుండెను. తీరిక సమయములయందెల్లను సీత, అనసూయ, సావిత్రి, దమయంతి, చంద్రమతి, మున్నగు మహాపతివ్రతల చరిత్రముల నెల్ల పఠన చేయుచు, వానిలోని రహస్యములను గ్రహించుచు, తనశక్తి కొలది వారిననుసరించి ప్రవర్తించుచుండెను. యీపుణ్యదంపతుల భక్తికి, వారి ప్రవర్తన కెంతయు సంతసించి వారి నిత్యకృత్యములను నిరంతరము తిలకింపదలచి విష్ణురాణియగు లక్ష్మి యెల్లకాలము దేవలోకమువిడచి వీరిగృహమునందే వసించుచుండెను. కనుకనే వారు సర్వ సంపదలతో తులదూగుచు బహుకాలము నడపిరి. కాని సంతానములేని కొరతమాత్రము వారిని చిరకాలమునుండి బాధించుచుండెను.

సంతానముకొరకు అనేక వ్రతములనుసల్పి, తీర్థయాత్రల నెన్నో శేవించిరి. ఏకాదశీ నుపవాసముల నెన్నోగావించిరి. కాని విఫలమనోరథులై తీర్థయాత్రలయందు నుపవాసములయందు వ్రతములయందు విసుగుజెందిరి. యెంత విసుగుజెందినను, తమ వంశదైవమగు పాండురంగని మాత్రము ఆదంపతులు మరచిపో లేదు. నిరంతరము రంగని భజింపుచుండిరి. ఇట్లు కొన్నివారము లును, నెలలును, వత్సరములును సహితము గడచినవి. రంగనికి మాత్రము కృపగలుగదయ్యె. కాని వారుమాత్రము రంగనియం

దసూయతగాని అనాచారముగాని యన్నడు నాచరించియుండ
రైరి. దానికతంబున అమ్మహనీయుని కృపచే బహుకాలమునకు
సుభద్రగర్భవతియై నొకశుభముహూర్తమున మగశిశువునుం
గాంచెను. పుత్రోదయమైనవార్త తెలియగనె విజయవర్మత్యంతా
నందభరితుడై ఏడవ నాడుత్తమ బ్రాహ్మణులను రావించి పుత్రు
నకు జాతకర్మాములను వ్రాయించి గొప్ప సంతర్పణ మొనరించి
ఉత్తమ బ్రాహ్మణులకు భూదాన, గోదాన, సువర్ణదానము
లొసంగెను. బీదలకు విరివిగా అన్నవస్త్రదానములను గావించి
బాలునకు తమ కిష్టదైవమగు "పాండురంగడు" అను నామధేయ
మొనర్చెను.

పాండురంగడును శుక్లపక్షమినాటి చంద్రునింబోలె దిన
దినాభివృద్ధినొందుచు, పంచవర్ష ప్రాయుడై తల్లిదండ్రుల కెంతయు
నానందము కలుగజేయుచుండెను. విజయవర్మయు, హిందూధర్మ
శాస్త్ర ప్రకారము పంచవర్ష ప్రాయుడైన నా బాలునకొక
శుభదినమున నుత్తమ బ్రాహ్మణులను రావించి యజ్ఞోపవీత
ధారణ మొనర్చి అక్షరాభ్యాసము గావించెను.

ఆ బాలుండును రామలక్ష్మణులంబోలె అల్పకాలములోనే
సమస్తవిద్యలయందారితేరినను బుద్ధియందు బిల్వమంగళుననుసరించు
నేమోనని చూచువారెలరకు వేషమును బట్టి పొడకట్టుచుండెను
సుభద్రా విజయవర్మలు సహితము, మన బాలుడిప్పుడు
చతుర్దశవర్ష ప్రాయుడై సమస్త విద్యలయందారితేరినవాడయ్యెను

గదా, యికనెచ్చట నైనను తగిన సంబంధమును చూచి వివాహమును చేయుటకు నిశ్చయించిరి. బంధుజనులలో తమబిడ్డడి కన్నివిషయములలో సరితూగు కన్యకామణి యచ్చట నైనను తటస్థించునాయని విచారించుచు తమతమ పనులు నిర్వర్తించు కొనుటకు యితర గ్రామాదులకు వెళ్లు తమ బంధువులతో, తమ బంధుకోటిలో పాండురంగనికి సరిపడు కన్యగలదేమో విచారింప మని తెల్పుచు ముఖ్య బంధువులుగల ప్రదేశమునకు తానే వెళ్ళి విచారించుచూ కుమారుని పాణిగ్రహణ ప్రయత్న భారము సంపూర్ణముగ వహించి తగిన సంబంధము న్గాంచక విజయవర్మ భార్యా సమేతుడై విచారింప దొడంగెను.

యివ్విధంబున విజయవర్మ తనవైపునను తన యర్ధాంగి యగు సుభద్రవైపునను సమస్త బంధుజాలమంతయు షుమారు నాలుగైదు సంవత్సరముల పర్యంతము శోధించి విఫలమనోరథు డయ్యెను. పాండురంగడన్ననో, పదునెన్మిది వత్సరముల ప్రాయము గలవాడై యవ్వనంబు తనకంకురించిన దోషమున పూర్వముండిన తనవేషమును క్రమంబుగ మార్చి యిప్పటి నవనాగరికతనుదాల్చి ప్రవర్తించు చుండెను.

గ్రామము నందు గల ప్రజలెల్లరును విజయవర్మను పాండురంగని వివాహ విషయమై ముచ్చటించుచు "బెండ కాయ ముదిరినను, బ్రహ్మచారి ముదిరినను" పనికిరాదని సూక్ష్మముగా చెప్పమొదలిడిరి. విజయవర్మయు తిరిగి తిరిగి వేసారి

"దిక్కు లేనివారికి దైవమే దిక్కనునట్లు" యీభారమంతయు కుల దైవమగు పాండురంగనిపై త్రోసివైచి, తనకుమారునికి తగిన భార్యను గూర్పుమని అనుదినము రంగనిపూజింపుచుండెను. యిట్లు విజయవర్మ నిత్యము భగవధ్యానముచే కాలము బుచ్చుచు వివాహప్రియత్న మెన్నడును దలపెట్టుకొనక, యెవరైనను కుమారుని వివాహమెన్నడని ప్రశ్నింపుచుండ సర్వము రంగని కృపయని వారికి సమాధానమిడుచుండెను. గ్రామములోని స్త్రీ లందరు నిన్న, మొన్నటివరకూనూ పాండురంగడు రఘువంశమును చేంక నిడుకొని పాఠశాలకేగువాడు. యెంతలో నెంతవాడేయ్యెనని చెప్పుకొనుచూ తట స్థమయినప్పుడెల్లను సుభద్రతో త్వరలో వివాహప్రియత్నమును గావింపుమని చెప్పుచుండిరి.

ఇట్లుండ పండరినాధుడు మాత్రము తనభక్తులగు సుభద్రా విజయవర్మలను మరచిపోలేదు. పీరుపడుకడగండ్లన్నియు చూచుచు మానవులెంతటి మూర్ఖులు, నాప్రియత్నము లేనిది యేపనికాదని వీరికి తెలియదుకాబోలు. కానిమ్ము వీరిప్రియత్న మెంతవరకో చూతమని మిన్నకుండెను. విజయవర్మ తన ప్రియత్నము సంపూర్ణముగ మానెననువార్త సంగ్రహించి వీరి భక్తికి కడుం గడు సంతసించి వకనాటిరాత్రి స్వప్నావస్థలో రంగడు విజయ వర్మకు గోచరుడై భక్తాగ్రేసరా నీభక్తి కెంతయు కడుంగడు సంతసించితిని. నీకోరిక చొప్పున యిచ్చటి కనతిదూరములో విష్ణు రాజపురమను నొక గ్రామము కలదు అందు నారాయణశర్మ యను నొక ప్రభుత్వోద్యోగి గలడు. అతనికి షద్మావతి

యను భార్యయు,రుక్మిణియను నేకపుత్రికయుఁగలరు. నారాయణ శర్మయు నాభక్తకోటిలో నొకడు. అతడును రుక్మిణివివాహ ప్రయత్నములనేక తెరంగుల నాలోచించి నీవలెనే ఆభారము నాపై వదలి వేసెను. రూపులావణ్యవతియగు రుక్మిణి కిప్పటి కష్టవర్షములు నిండినవి. పిన్నవయస్సుననే వ్రాయను చదువను బహుచక్కఁగ నేర్చి గృహకృత్యములను చక్కబెట్ట నారితేరెను.

ఆ బాలిక నీకు కోడలు కాగలదు. లెమ్ము, తక్షణమే విష్ణురాజపురమున కరుగుము. కార్యసాఫల్యము కాగలదని నట్లాపారు డులికిపడి లేచి తనయర్ధాంగియగు సుభద్రను మేల్కొలిపి జరిగిన దంతయు పూసగుచ్చినట్లు జెప్ప నామెయు కడుంగడుసంతసించెను. ఆదంపతు లిరువురును నిద్రలనుమాని పాండు రంగని భజింపుచు సూర్యోదయమున కెదురు చూచుచుండిరి.

భానుడును వీరి యాతురతను గ్రహించి త్వరలోనే దర్శన మిచ్చెను. విజయవర్మ నిత్యకృత్యములను తీర్చుకొని తనకు బంధువులును,మిత్రులునునగు నల్వురు బ్రాహ్మణులు తన్ను వెంటాడగా పాదచారులై విష్ణురాజపురమునకు సాయంసమయమునకు చేరుకొనిరి.

మార్గమధ్యంబున పూరుగాని, పల్లెగాని తటస్థము కానందున వారికి భోజన మింతవరకుఁ లేదయ్యె. కార్యదీక్షాపరుడగు విజయవర్మ కంతగా తొందరలేకుకాని, వెంటవచ్చినభూసురులప్పుడే తమభోజనము సంగతి మాటిమాటికిని జ్ఞప్తికిదెచ్చుచుండిరి.

యిప్పటివలె నా కాలమున అన్నవిక్రియశాలలు లేనందున విజయుడీ విషయములో ఆతురత పడుచుండెను.

వారిప్పుడు పోవుచదొక విష్ణాలయప్రాంతము. అందు పలువురు పురవృద్ధులొకచో కూర్చుండి దైవసంబంధమగు కథలజెప్పు కొనుచుండిరి.

వారిలో నొకవృద్ధుడీ విజయవర్మకడ కాతురతతో నరుదెంచి అయ్యలారా! తమదేయూరు? సూర్యాస్తమయ మయినది. ముందు పట్టణముగాని, పల్లెగాని దాపులో లేదు. మా యింటికతిథులుగా నరుదెంతు రేయునినది తడవుగ విజయవర్మ వెంటనున్న విప్రులందరొక్కపరి నుత్సుకనున్న తమతల లిటులటు లూపిరి.

ఆవృద్ధపారుడపరిమితానంద భరితుండై వారిని వెంటబెట్టు కొని తన నిజవాసంబున కరిగెను. వృద్ధురాలగు నాయింటియిల్లాలు నాటి కెవ్వరినేని తమయింటి కతిథులను తనభర్త తెచ్చునో లేదో నని చింతించుచుండ నింతలో విజయవర్మానుఁజూచి కడుంగడు సంతసించెను.

తాము నాడింకను భుజింపలేదనియు త్వరలో వంట గావింపకున్న మాప్రాణములు దక్కవని విజయునివెంటవచ్చిన వారిలో నొక భోజనప్రియుడనెను.

ఆయిల్లాలును త్వరలో వంటలను జేసి సలసలగాగు నీటితో వారికి మార్గాయాసములదీర్చి వృద్ధుడగు తనభర్త సహితముగా వారిని భుజింపఁజేసెను.

నాటికా బ్రాహ్మణు లొంటిపూట పడినందున పచనపదా ర్థములన్నియు నారగించిరి. పాపము వృద్ధురాలగు నాయింటి యిల్లాలు తిరుగ శ్రమపడజాలక నాటికి పస్తుపరుండవలశివచ్చెను.

భోజనా నంతరము తాంబూల నశ్యాదుల నారగించిన పిమ్మట వృద్ధుడగు నాయింటి యజమాని అయ్యలారా! తమదే యూరు? యెటకేగుచుంటిరి? ముందొకపరి తమనడుగ మార్గాయాసమువలన గాబోలు శలవివ్వకుంటిరన నందులో నొకడు చమత్కారముగ యిందనుక మార్గాయాసాము యిప్పుడు భుక్తాయాసమనియె.

విజయుడు వానిని మందలించి, స్వామీ! మాయదికృష్ణగిరి నన్ను విజయవర్మయందురు. వీరు మాబంధువులు యీ గ్రామమునకే వచ్చితిమనెను. వెండియు నోపుణ్యాత్మా తమ దయవలన నేటికింత భుజింపగల్గితిమనియె.

అయ్యలారా, నాపుత్రుల దయవలన నాకుతినను, యితరులకు పెట్టనుకూడ గలదు. వారు బ్రతికియుండు కాలములో రాజ ముఖ్యస్థానమునం దున్నతోద్యోగములం దుండుటవలన కావలశినంత సంపాదించిరి.

వారు సంపాదించిన ధనమునే సివ్వఖంబున వెచ్చించుచున్నాననియె. పాపమీ వృద్ధుడు తనపుత్రులను గోల్పోయె గాబోలునని తలంచి విజయు డయ్యా తమకు పుత్రులెందరు? యెంతకాలముక్రింద బ్రతికియుండిరి? వారి మృత్యుకారణం బెద్దియని

యనుగ, నా వృద్ధ దంపతులు బోరుబోరున నేడ్వ సాగిరి. పొరలివచ్చు దుఃఖ మావృద్ధుడాపుకొనుచు నివ్విధంబున జెప్పఁ దొడంగె.

నాకు నల్వురు పుత్రులును, నొక పుత్రికయు కలరు. వారి నల్లారుముద్దుగ బెంచుచూ నానల్వురు కుమారులను సమస్త విద్యలయం దగ్రగణ్యులుగ నొనర్చితిని. వారును విద్యలయందు సరస్వతి నోటినుం డూడిపడినట్లు నారితేరిరి. అంతనా దరిద్రత నన్ను బాసిన సూచనలు గన్పట్టునో యనునట్లు ప్రభువును వారి తెలివితేటల కెంతయు సంతసించి తన పరిపాలనా శాఖయందు నానల్వురు పుత్రుల కగ్రస్థానములం దుద్యోగములిచ్చెను. వారును రాజునకు సంతోషమునుగూర్చు పనులను చేయుచు ప్రజల కను కూలముగ మెలంగుచూ మున్నెన్నడు యెవ్వరు గాంచనంతటి గౌరవమును సంపాదించిరి. అట్టిసమయముననే, నేనీ యున్నతసౌధ మును గట్టింపగలిగితిని. మరియు కావలశినంత ద్రవ్యమును దాచ గలిగితిని సామాన్యముగా లోకములో అన్నదమ్ము లైకమత్యము గానుండు టరుదు. వీరన్ననో మిత్రభావముగ ప్రవర్తించువారు దీనికి ముఖ్యకారణము నలుగురు నొకేప్రదేశమునందుద్యోగములు సంపాదించుటయే. అంతట క్రమంబుగ నల్వురుపుత్రులకు కళ్యాణ మొనరించి వారిం గాంచి లోలోపల దశరధునియంతటి వాడను గదాయని సంతశించుచు మెంతయు నుబ్బుచుంటిని.

నరునకు నాలుగువాంశలను పెద్దలుచెప్పిన సామెత వృధా

పోవునాయుడనట్లు, చిన్నతనంబున దరిద్రతచేత బీడింప బడితిని, తదుపరి సమస్తవైభవములతో తులదూగితిని, అప్పటికి రెండుహాంశములు గడచినవిగదా, విప్రవర్యులారా! యిక నామూడవ హాంశమును చెప్పుచున్నా నవధరింపుడు.

నాపుత్రులు నల్వురును యింకను, వున్నతవిద్య నభ్యశింప వలయునను ఆశతో నలుగురును రాజస్థానమునం దొక వత్సరము శలవుగైకొని క్రొత్తవిద్య నభ్యశింపుటకు నలుగురు నాలుగు దేశములకు పైనమైరి. నేనెంత వారించినను నామాటలు విన్నవారుకారు. ఇదివరకెన్నడును నామాట జవదాటని నాపుత్రరత్నములు నల్వురు బయలుదేరిరి. వారిపైనమునకు పూర్వము నలుగురు నేకీభవించి మనకుతగిన విద్య లభ్యమైననూ కాకపోయినను తిరుగ యీరోజువచ్చు నాటి మధ్యాహ్నమునకు అనగా సరిగా వక్క సంవత్సరమునకు యీయూరి కనతిదూరములో నున్న దుర్గాలయమువద్దకు వచ్చునట్లొండొరు లొడంబడి వలశినంత ధనముగొని నాలుగు దిక్కులకు నలుగురు వెళ్ళిరి. యిట్లొక వత్సరము లోపల వారు, శక్తికొలది విద్యలంబడసి నియమిత కాలమునకు దుర్గాలయమునకువచ్చి చేరిరి. ఆలయప్రదేశమంతయు నిర్జనారణ్యమైయున్నది. నలుగురును క్షేమకరముగా చేరినందుకు వారెంతయు సంతసించిరి.

అందులో అగ్రజుడు:— తమ్ములారా! మీరేయే విద్యల నభ్యశించితిరని యడుగ, అందగ్రసోదరుడు, అన్నయ్యా, సమస్తజీవ

కోటి అవయవములలో యేభాగముదొరికినను, అది యేజాతిజంతు వుసదైనది వివరింపగలవిద్య నేనభ్యసించితిననెను. దాని కెంతయు నచ్చెరువంది రెండవవాడట్టులైన వివరింపబడిన అవయవమునందు మిగిలిన అవయవములను చేర్చి అస్థిపంజరముగ నొనర్పగలనని యెను. అంత మూడవసోదరుంగాంచి అగ్రజుడు నాయనా నీవే విద్యయందు సామర్థ్యమును సంపాదించితివని యడుగ అగ్రజా యేజంతువునైననుసరియే అస్థిపంజర మాధారముండిన చాలును దానికి కండరములనుచేర్చి జీవములేని శవముగ జేయగలనని నుడి వెను. సోదరులవిద్య కెంతయు సంతసించి అట్టులైన నో తమ్ము లారా మృతకళేబరమున కాయుర్దాయమునొసంగు విద్య నాకడ నున్నదనిచెప్పెను. వారు నలుగురును వకశాఖకు సంబంధమగు విద్య నభ్యసించుట కెంతయు సంతసించిరి.

వారి విద్యలంగూడ నప్పుడె పరీక్షింపందలంచి అందొక డా యరణ్యమంతయు వెతకి ఒకయెముకను సంపాదించుకొని వచ్చి దాని నతడు పరిశీలించి ఇది వ్యాఘ్రి మొదముకాలి పిక్కయెముక యని చెప్పెను. వెంటనే రెండవతమ్ముడు దానిని అస్థిపంజరముగ నేర్పరచెను. "విద్యనేర్చిన వా రెప్పటికైనను మిన్న కుందురా" అంత మూడవసోదరుడు దానికి మాంసచర్మములు కప్పి శవాకా రముగ నేర్పరచెను. వెంటనే అగ్రజుడు కడుంగడు సంతసించి తన మంత్రబలముచే దాని కాయుష్యముబోసి మిన్నకుండెను. విద్య నభ్యసించినవారిలో కూడ మూర్ఖులుందురు కాబోలునని విజయు

వర్మ ప్రశ్నింప దానికా నలుగురు విప్రులు వానినివారించిరి.

తరువాత నేమిజరిగెనని ప్రశ్నింప బ్రాహ్మణ వర్యులారా, యిక నేమని విన్నవింతును. ఆపులి తాను సజీవమందుండగ ఆకలి బాధచేతనే మృతినొందిన కారణముననున్నా బ్రతికించిన జీవము మును తిరుగ చంపుట నేర్వని వారగుటచేత వెంటనే ఆవ్యాఘ్రము వీరిని నల్వురను బక్షించెనని చెప్పుచూ నావృద్ధవిప్రుడు భార్యా సహితముగ బోరున నేడ్వసాగెను.

అటులైన విధవలగు నీనల్వురు కోడండ్రు పుట్టినింటికిచేరిరి గాబోలునని ఆవిప్రులన విని ఆవృద్ధుడు అయ్యా వారు యిప్పటి స్త్రీలవలె నటించువారుకారు. వ్యాఘ్రమువారి నలుగుర శిరస్సు లను మాత్రము దుంచి రక్తమునుగ్రోలి వెడలిపోయెను.

నిత్యనైవేద్యము నిమిత్తము వెళ్ళిన ఆగుడి పూజారి యిది యంతయు గుడిలోనుండి చూచి పూస గుచ్చినట్లు నాకు తెల్పెను. అంత నామృతకళేబరములను దహనముజేయ ప్రయ త్నింప నాకోడండ్రు తామును సహగమనమయ్యెదమనిరి. తమ్మ తనకొమార్తెలంబోలె నల్లారుముద్దుగ పెంచెదమని మేమెంత బ్రతి మాలిననూ వినక తమతమపతులతో సహగమనము గావించిరి. నాటినుండియు చేయు పనేమిలేక మిన్నకుండి వారుసంపాదించిన ధనమంతయు బీదల కన్నదానముచేయుచూ అతిథి బ్రాహ్మణులను సత్కరింపుచు తీరిక సమయములయందు భగవధ్యానము చేయు చూ కాలము గడపుచున్నామని నుడివెను.

అటులైన నోపుణ్యాత్మా, తమరు చెప్పుటలో నలుగురు పుత్రులనియు నొక పుత్రికామణియనిగదా? పుత్రికసంగతి మరచి నట్లున్నది ఆమె స్థితిగతులేమని ప్రశ్నింప, ఆమె నీయూరనే యొక ప్రభుత్వోద్యోగి కిచ్చి వివాహ మొనర్చితిననియు ఆమెయే ఇప్పుడు తమ్మాదరించుచున్నదనియు చెప్పెను.

ఆమెకు సంతానమ్ము మున్నదా యని తిరుగ విజయ వర్మ ప్రశ్నింప నావృద్ధుడు ఆమెకొక పుత్రికామణి కలదనియు, ఆమె యిప్పు డష్టవర్ష ప్రాయయనియు, తన అల్లుడు ఆబాలకు తగిన వరుని వెదకుటకు నానాదేశములకు బ్రాహ్మణోత్తములను బంపె ననియు, యింకను తగినవరుడు లభ్యము కాలేదనియుఁ చెప్పగా విని ఆవిప్రు లొకరి ముఖ మొకరు చూచుకొనిరి.

వారిలో నొకరు, అయ్యా తమకుమార్తె నామధేయ మే మని యడుగ పద్మావతియనెను. అంతట విజయవర్మ తుళ్ళిపడి పద్మావతియా? అటులైన నామె భర్తపేరు నారాయణ శర్మ గాదా యని యడుగ అవునని యా వృద్ధ బ్రాహ్మణు డనుచు అయ్యా వారిని మీరెట్లెరుంగుదురు? అనెను.

స్వప్నావస్థయందు తిలకించిన దంతయూ మరుగు పరచక జరిగిన వృత్తాంతమంతయు విజయవర్మ పూసగుచ్చి నట్లా వృద్ధ దంపతులకుజెప్పి వారిని సంతోషపరచెను. వెండొరులు వెతుక బోయిన తీగ కాళ్లకే చుట్టుకొనిన దనుకొని నాటికచ్చట అంద రును సుఖముగ నిద్రించిరి.

మరునా డుదయమున ఆవృద్ధ బ్రాహ్మణుడు పెందలకడ మేల్కాంచి కూతురింటికేగి యీ జరిగిన వృత్తాంతమంతయు జామాతకును కూతునకుఁ జెప్పి యీవిప్రు లందరిని తన కూతునింటికి వెంటబెట్టుకొని చనియెను. వొండొరులు వారివారి గోత్రములను సరిచూచుకొనిన అవియు ననుకూలముగా యుండుట కెంతయుసంతసించిరి కాని, యిప్పటివలె నప్పుడు ఛాయా పటములను తీయు యంత్రము లమలులో లేనందున విజయవర్మ తన కుమారుని ఛాయాపటమును తేజాలక పోయెను. కోడలిని మాత్రము చూచి సంతుష్టాంతరంగుడయ్యెను. వెంటవచ్చిన విప్రవర్యులును యిది చాల అనుకూలదాంపత్యమని తమతమ మూరెడుకాయల లోని నశ్యములను బీల్చుచు తలలూపిరి.

అంత నారాయణశర్మ అల్లునిచూడ కుతూహలుడై పద్మావతి సహితముగా విజయవర్మ మొదలగు వెంటవచ్చిన బ్రాహ్మణులతో బాటు వృషభశకట మొక టేర్పాటుచేసికొని బయలుదేరి నాటి సాయంకాలమునకు కృష్ణగిరి చేరిరి.

అల్లుని రూప లావణ్యమునకు విద్యా విశేషమునకు దైవభక్తికెంతయు సంతసించి నారాయణశర్మ పద్మావతులు లగ్నమునకు తొందరపడుచుండిరి.

యీకాలములో వలె అప్పుడు కట్నములు, కానుకలు, సొమ్ములు, అత్తచీరలు యింకా యేర్పడియుండనందున నిమిష కాలములో నుత్తమబ్రాహ్మణులనురావించి నొకశుభముహూర్తము నిశ్చయించిరి.

బహుకాలము తగినకన్య దొరుకక విజయవర్మయు, తగిన వరుడు దొరుకక నారాయణశర్మయు తిరిగితిరిగి వేసారినందుకు అనుకూల దాంపత్య మమరినదని వృథయు లపరిమితానందము నొంది సత్సుముహూర్తమునకు వివాహము నిర్విఘ్నముగ జరిపిరి.

వివాహము జరుగబోవుటకు ముందు విజయవర్మ పాండు రంగ సప్తాహము చేయవలయునని బహుకాలమునుండి అనుకొను చుండెనేగాని యీవివాహ సంతోషమున రంగని సంపూర్ణముగ మరచిపోయెను. చూచితిరా, విజయవర్మ కంఠకావరము. పుత్రు నికొరకు విలపించుచున్నతరి పుత్రసంతానమును, తదుపరి కన్యా న్వేషణమున విసిగి వేసారియున్న వేళ తగినకోడలిం గూడ నొసగూర్చినట్టి కలదైవమగు పండరినాథునే మరచిన విజయవర్మ నేమనవలయు?

వివాహసమయమున నుత్తను బ్రాహ్మణులను రావించి సువర్ణాది దానము లొసంగెను. వెండియు బీదల కన్నదానము నొసగెను.

ఎన్ని ఉత్తమకార్యములు గావించినను పుత్రులులేక విలపించుచున్నతరి, సుపుత్రసంతానమును, తదుపరి నుత్తమురాం గనయగు కన్యను కుమారునకు నర్ధాంగిగా నొసగూర్చిన పాండు రంగని వివాహసందర్భమున మహో వైభవములకు లోనై బొత్తుగా మరచెనుగదా!

విజయవర్మరంగనిమరచినను, రంగడాతనినిమాత్రము మరచి

యుండలేను. పాణిగ్రహణానంతరమున నైనను, నేను జ్ఞాపకము రాకయుందునాయని కొంచెంతయూశతో రంగడు కామరూపుడై విజయవర్మను చుట్టుకొని తిరుగుచుండెను. కాని అప్పటికైనను, విజయవర్మకు యిలవేల్పుగు పాండురంగడు జ్ఞాపకము రాలేదు.

అప్పుడు రంగడాగ్రహుడై యెల్లకాల మీకపటభక్తుని నమ్మికొనియుండుట కూడదనియు, కోరినవరము లొసంగినను చిట్టచివరకు తన్నాదరించలేదని కోపించి వెండియు, నాదివ్యక్షేత్రంబగు పండరిపురమున నా ఆలయములో లెక్కకు మిన్నయగు నిజభక్తులు నన్నుంగానక పరితపించుచున్నారు. నేను వేవేగ నచ్చటికేగవలయునని భగవంతుండగు నాపాండురంగడు తక్షణమే ఆప్రదేశమున్విడచి నిజపుర మార్గమునుబట్టి మనోవేగమున ఆలయమునందు జేరుకొనెను.

వివాహ అలజడియంతయు శాంతించిన తదుపరి నూతన బాంధవ్యమగుటంజేసి నారాయణశర్మ, విజయవర్మను కుటుంబ సహితము కొంతకాలము కృష్ణరాజపురమున వసింపమని వేడ, యింట నెవరులేక వచ్చుట కష్టతరమనియు, సుభద్ర, రంగనిసమేతముగ రాగలదనియు, తిరుగ త్వరలో వారిని పంపవలయునని ప్రత్యుత్తర మిచ్చుచు పయనము గావించి పుత్రి సమేతముగ సుభద్రను కృష్ణరాజపురమున కనిపెను.

మరునాడుదయమున విజయవర్మ భోజన తాంబూలాదులారగించి నొకచో విశ్రాంతిం గొనుచు పూర్వమొకప్పుడు తెచ్చి

యుంచిన పాండురంగని దివ్యమూ ర్తిని అద్దములోఁగాంచి యులికి పడిలేచి గుండెలపై బాదుకొనుచు, కన్నీరుమున్నీరై కారనేడ్చుచు రంగా నాతప్పు మన్నింపుమని క్రిందబడి పొర్లాడుచుండెను.

యీసమాచార మెద్దియో చెప్పుటకెవ్వరికి నసాధ్యముగ నున్నది. యిరుగుపొరుగు వారందరు గుమికూడిరి. విజయవర్మ, తలపై బాదుకొనుచు, రోజుచు, ధూళిలో పొర్లాడి లేచుచు, యెలుగెత్తి బోరుననేడ్వసాగెను. యింట నీయజమాని నాదరించు వారెవ్వరును లేరైరి. చిన్నగ్రామమైనందున యీవార్త గ్రామ మందంతటను తెలిసిపోయినది. గుంపులుగుంపులుగా విజయవర్మ విచిత్రదుఃఖమును చూచుట కరుదెంచిరి. వచ్చిన గ్రామస్తులం దిలకింపక వా రేమడిగినను ప్రత్యుత్తరము చెప్పక భూమిపై పొర్లాడుచు పొరలిపొరలి నేడ్చుచుండెను.

కొందరీతని కేదియో పిచ్చియెత్తినదనియు, కొందరు జెర్రియో, పామో కరచినదనియు, మరికొందరు వివాహమునకు ధన మువట్టిపోయినదని దుఃఖించుచుండెననియు, పలువురు పలుమాట లాడుచుండిరి.

అంత నాయూరిగ్రామోద్యోగి నచ్చటికరుదెంచి, సూది పోటులను బొడుచు డాక్టరులింకను దేశమందంతటను వ్యాపించ నందున, నాటువైద్యులం బిలిపించి పరీక్షింపంజేసెను.

వారును బెద్దయుం బ్రొద్దుపరికించి చూచి యిదియేదియో మనోవ్యాధికాని, యితని కితరజాడ్య మేదియు నావరింప లేదని

మూర్ఛగబల్కిరి. అంత గ్రామోద్యోగి "విజయవర్మా" యనిపిల్వ, ప్రతిమా, సప్తాహమా, పూజయా, యని వచ్చినవారి నందరిని, కౌగలించుకొని నేడ్చుచు, ప్రతివ్యక్తియు తనకు రంగని స్వరూప ముగ గాన్పించుచున్నందున ప్రతివారి కొనకాళ్ళంటి నమస్కరిం పుచు, నాతప్పు క్షమింపుమని వేడుకొనుచు, యిల్లు నెత్తినగట్టు కొని రోదనము చేయుచుండెను.

గ్రామపెద్ద కాపులందరు, కాగడాలంబోలె తమతమ చుట్ట పొగలను గుప్పుగుప్పునవదలుచు వకరిముఖ మొకరుచూచుకొని పెదవివిరచిరి.

పాప మేపాపమెరుగని రుక్మిణినిదూరుచు, కోడలు పాద ముపెట్టిన వేళావిశేషమని స్త్రీలు గుమిగూడి చెప్పకొనుచుండిరి. కొందరు స్త్రీలు విజయవర్మతోబాటు పొరలివచ్చు దుఃఖము నాపుకొనుచు కండ్ల నీరుగార్చుచు, విజయవర్మ నోదార్చుచుండిరి. అతనిదరికేగి నోదార్చుట మంచిదికాదనియు, మతిపోయిన వ్యక్తి మైబడి కొట్టవచ్చునని కొందరు వారిని వారించుచుండిరి. కొంతవడి కచ్చట జనసమూహము పల్చబడెను.

ఈకాలములోవలె నప్పుడు తంతితీగెలు లేనందున యీ వార్త త్వరలో కృష్ణరాజపురమునకు తెలుపుటకు వీలుగలుగక అశ్విశిక్షయం దారితేరిన నిరువురువ్యక్తులను గ్రామోద్యోగిపిలిపించి యేదో నొకకమ్మ వ్రాసి తక్షణము మీరు కృష్ణరాజ పురమునకు పోయి యీ వింతవార్త పాండురంగ సుభద్రలకు తెల్పుడని పంపివైచెను.

అప్పటికే పగలు పంద్రెండుగంటలాయెను. గ్రామములో వృక్షములుమాత్ర మిండ్లకడనుండిరి. బాలురు తమతమ పాఠశాలల కేగిరి. పెద్దవారు తమతమ పొలముల కేగిరి. గ్రామమంతయు నర్ధ రాత్రింబోలె మాటుమణగెను. విజయవర్మ రోదనముదప్ప మరే మియు వినబడుట లేదు. ఏడ్చినప్పుడెల్లను చంటిబిడ్డల నోదార్చుచు మిగిలిన సమయములందు వృద్ధాంగనలు నూలువడకుచుండిరి.

ఇట్టితరి విజయవర్మ ఆకలిదప్పుల నెరుంగక వేరేమియు నొల్లక, యిల్లు బయలుదేరి ఏకదీక్షా పరవశుండై గ్రామము వదలి వడివడి బరువ మొదలిడెను.

అట్లతడు పిక్కబలమునుజూపి క్షణకాలములో కనుచూపు మేర కానబడ కదృశ్యుడయ్యెను.

గ్రామవాసులందరు తమతమ పనులకువెళ్లి యుండుట విజయ వర్మ స్థితిగతు లెవ్వరును విచారించరైరి. నాడి రసాలైనందున ధనలక్ష్మి నరవాహనా రూఢురాలై గ్రామోద్యోగి తన్ను వెన్నం టిరాగా రాజముఖ్యస్థాన ధనాగార మలంకరించెను. విజయవర్మ యిల్లుబయలుదేరుటకివి ముఖ్యకారణములు.

అశ్వరూఢులైవెడలిన యిరువురువ్యక్తులు తా మశ్వశిక్ష యందు దారితేరిన వారగుటచే క్షణకాలమున కృష్ణరాజపురమును చేరిరి. అల్పకాలము క్రింద జరిగిన పెండ్లియిల్లగుటచే శుభసూచ నములను బట్టి యితరసహాయ్యము లేకనే, నారాయణశర్మ యింటి కేగి, నారాయణశర్మ యవరని భీకరధ్వనిచేసిరి. వివాహమైనది

మొదలు వేళకు సరిగా నిద్రాహారములులేనందున నాడు శ్రమపడి విందారగించి, గృహవాసులందరు బంధుసమేతముగ గుర్రుపెట్టి నిద్రించుచుండిరి.

వివాహసమయమున నూతనదంపతులు లొండొరులారితేరి చూచుకొననందున, యీ తరుణము వారి కాటపట్టై యుండెను. రుక్మిణి గదిలోని గవాక్షమునుండి మాటిమాటికి తనపతిని నిక్కి నిక్కి చూచుచుండెను.

గుర్రములు బహుదూరప్రయాణ మొనర్చినందున గస పెట్టుచు వాకిట నిలువంబడి, గుర్రుపెట్టి నిద్రించుచున్న వారి ధ్వని నవి చెవులునిక్కబొడుచుకొని విని తమయులసటకువారెక శెక్కము లాడు చున్నారని, కేగ్రంట రౌద్రముగ జూచుచుండెను.

అశ్వికుల భీకరధ్వనివిని పాండురంగడు తేరి పారచూచి తమ గ్రామవాసులగుటంజేసిసంతసించిదప్పిగొనియున్న వారికుచిత పానీయము లిప్పించెను.

అంత తమయొద్దయున్న లేఖ నాభటులు పాండురంగని కొసంగిరి. అతడాయు త్తరము నారితేరజూచి కొంప మునిగినదని బిట్టుగ కేకవేసెను.

సుఖనిద్రాపర వశులైన గృహవాసు లందరు తుళ్ళిపడి మేల్కాంచిరి. అల్లునిజూచి మామయు, మామనుజూచి తక్కిన వారును గొల్లుమనిరి. వీరియాకస్మికరోదనమునకు యిరుగు పొరుగు వా రచటి కరుదెంచి వారును కంటతడిపెట్టిరి. కాని సమాచార

మేమిరెటో తెలుసుకొనజాలక వెర్రులై వాపోవుచున్న నంత సుభ
ద్ర రంగని దరిజేరిః నాయనా, యన్వరికేమి మూడినది. కృష్ణగిరి
యందు మీాజనకుడు కుశలమేగదా? యని ప్రశ్నింప నాతడా
కమ్మను తిరుగ స్వయముగ చదువజాలక మామగారికిచ్చెను. ఆయ
నయు పొరలివచ్చు దుఃఖము నాపుకొని యివ్విధంబున చదువం
దొడంగె.

కృష్ణగిరి.

చిరంజీవా,

పాణిగ్రహణా నంతరము, నీవర్ధాంగిసహితముగ సత్తవా
రింటికేగిన నుచితముగ నుండెడిది. అట్లుగాక నీతల్లి సుభద్రంగూడ
వెంటబెట్టుకొని చనుట కేవలము పొరపాటని నాతలంపు. అది
యేమికారణమోకాని నేడు మీాతండ్రి విజయవర్మకు మతిపోయి
నది. యవరేమడిగిననూ మతిపోయిన మాటలాడుచు అన్నపానీ
యములొల్లక విలపించుచున్నాడు. కారణము మేమెవ్వర మూర
యజాలకున్నాము. ఉత్తమవైద్యులను రావించి పరీక్షింపంజేసిన
వారీవ్యక్తి కేలాటిజాడ్యమూ వరించియుండలేదని నుడివిరి. దానం
జేసి నావిధిప్రకార మున్న యదార్థము తెలియపరచితిని.

ఇట్లు,

గ్రామోద్యోగి.

కమ్మలోని పూర్తిసంగతులు గ్రహించక పూర్వమే సుభ
ద్ర నేలంబడి మూర్ఛిల్లెను. నూతనబంధువు లందరామె కుపచర్య

లం జేయుచుండిరి. అత్తగారిమూర్ఛ కెంతయు రుక్మిణి దుఃఖించు చుండెను. తననాథుని దుఃఖమును చూచజాలక లోలోన కృశిం పుచుండెను. మనము చింతించిన ప్రయోజన మావంతయు లేదని యు, వేగముగ కృష్ణగిరి కేగవలయు ననియు, కాలవ్యాపనము చేయు టుచితము గాదనియు, నారాయణశర్మ వారి కూరడింపు మాటలం జెప్పుచు, నొక శేవకుని రావించి "యోరీ„ నీవీతక్షణమేగి యొక మేనాను తెప్పించమని నాజ్ఞనిడ నాతడు మహాప్మదీయు డైనందున చిత్తము మహాప్రభూయని నేల నంటనంగి సలామొనర్చి వెడలి రెప్పపాటులో నొక మేనాయు, దాని నానోహాకులను రావించెను. అంత సుభద్ర నా మేనాలో నెక్కించి కృష్ణగిరికి పయ నముజేశి పంపుచు, తాను జామాత సహితముగ నశ్వారూఢుడనై వచ్చెదనని నారాయణశర్మ సుభద్రను సాగనంపెను.

అంత నారాయణశర్మ తనయింట నాశ్వికుల కుచితమర్యా దలం జరిపి మీరు రేపటియుదయమున పాదచారులై రండనియు తామిప్పుడేయీయశ్వముల నారోహించి కృష్ణగిరికి వెళ్లుటముఖ్యా వసరమనియు, జెప్పి వారి నొడంబరచి తక్షణమే జామాత సహి తముగ గుర్రములనెక్కి వాయు వేగమున సుభద్ర చేరుటకు మున్నుందె కృష్ణగిరిచేరిరి.

విజయవర్మ గ్రామమువదలి వెళ్ళిన సమాచార మప్పుడే గ్రామమందంతటను వెల్లడియయ్యెను. అక్కటా చూచితిరా, సమస్తవైభవములతో తూలనాడు సంసారము నేడెట్టితీరునకొచ్చె

నో యని గ్రామస్తులు చెప్పుకొనుచుండిరి. రాజధనాగారమునకు వెళ్ళిన గ్రామోద్యోగి తనపని నిర్వర్తించుకొని గ్రామముచేరుసరికి వార్త నాతనికి తెలిపిరి. ఆతడును కొంతవడి విజయవర్మ దుస్థితి కెంతయు చింతించి, సుభద్రా పాండురంగ డిల్లుచేరువరకు భద్రముగ విజయవర్మ గృహమును గాచుచుండెను. యింతలో నశ్వరూఢుడై, నారాయణశర్మ అల్లునితో నిల్లుచేరెను. వీరిని చూడగనే జనసమూహ మంతయు నిశ్శబ్దము గనుండెను. గ్రామోద్యోగి గడచిన సమాచారమంతయు పూసగ్రుచ్చినట్లువారికి విశదపరచెను పాండురంగడు పొరలివచ్చుదుఃఖమునాపుకొని, దుఃఖించినప్రయోజనము లేదని తలంచి, కర్తవ్యమునాలోచింప వలయునని మామగారితోసహా గ్రామోద్యోగితో నాలోచించుచుండెను. యింతలో సుభద్రయు మేనాదిగెను. జనసమూహముచూడగనే ఆమెయు నిశ్చేష్టురాలయ్యెను. నిరంతర లక్ష్మీనివాసమగు తనగృహముచిన్నవోయియుండుటఁజూచి యా పతివ్రతాసిరోమణి, "నాథా" యని వాపోవుచుండెను. కృష్ణగిరియందామెనుజూచి కంటతడిబెట్టనివ్యక్తి లేడయ్యె. గ్రామవాసులంద రామెనూరడించుచుండిరి.

యీ యాపత్సమయమందు నీవేమాకు దైవమని నారాయణశర్మగ్రామోద్యోగిని భట్రాజువలె పొగడెను. అల్పసంతోషియగుటంజేసి ఆతడెంతయు నామాటలకుబ్బి రక్షకభటులనందరి నన్నివైపులకు విజయవర్మ జాడలనరసిరండని పంపివైచెను. నిపుణతగలవారికశ్వములనిచ్చి పంపెను. బాలురుసహితము పాండురంగనికి

తోడ్పడెడువారే కాని, యిప్పటివలెనా కాలమున తొక్కుడుబండ్లు లేనందున మిన్నకుండిరి.

ఇట్లుబయలుదేరిన విజయవర్మ పండరినాధుని ధ్యానింపుచు తనతప్పు క్షమింపుమని వేడుకొనుచు, పల్లెలు, పట్టణములు, కొండలు, గుట్టలు నడచి అరణ్యమార్గమునుబట్టి పోవుచుండెను. అంత నాయరణ్యమందు త్రోవదప్పి నొకచోకూలంబడి విచారించుచు, తనలోతా నేదియో మాట్లాడుకొనుచు, మధ్యమధ్య చేతు లెదపై నిడుకొని అమ్మయ్యోయని కుమిలి, కుమిలి నేడ్చుచుండెను.

ఆదినుండియు విజయవర్మ కష్టము కన్నులారగాంచుచు నికచూడజాలక భానుడుసహితము స్తగిరి జేరెను. పక్షిజాతులు కలకలారవములుచేయుచూ, తమతమ బిడ్డలం జూడ కుతూహలతచే గూండ్లుచేరుటకు వేవేగజనుచుండెను. తమకుపుట్టు విరోధియగు భానుడ స్తగిరిచేరగనే ఘూకములు మేతలకొరకై తమతమ గూండ్లను వదలిచనుచుండెను. గబ్బిలము లాకాశమున చెర్లాట లాడుచుండెను.

అంతట దుర్ఘటమగు అడవియను రాక్షసరాజు, చీకటియను ఘోరకాంతను గూడి సుఖముగ రమించుచుండెను. యిట్టి నిశీథ సమయమున విజయవర్మ వకబండిగురివింద పొదదాపున విశ్రమించెను. క్షుద్బాధాపీడితుడై పగలంతయు, బహుదూరప్రయాణముచే నలసట జెందినను గాఢముగనిద్రించెను.

విజయవర్మజాడల నెరుంగనేగినభటులలో కొందరు తమతమ

స్వకార్యములను చక్కబెట్టుకొని తిరిగివచ్చి, వర్షమునకై పరితపించుచాతకపక్షికైవడి చారులవర్తమానమునకు చెవులునిక్కబొడుచుకొని చూచుచున్నసుభద్రను తమకెచ్చటను విజయవర్మ జాడ గన్పట్ట లేదని చెప్పి నా మెనుస్సురుమనిపించుచుండిరి. కొందఱుపిల్లలు నలువైపుల దిక్కులఁజూపుచు పరువిడుచుండిరి. స్వామిభక్తిగల వారు వారి శక్తికొలది నానా దిక్ప్రదేశముల కఱిగి ఆయన జాడ లెంచును గానక నిరాశజెంది పురము జేరుకొనుచుండిరి.

విజయవర్మను వెతకిపట్టితెచ్చినవారికి తనయాభరణములన్ని యొసంగెదనని సుభద్రగ్రామమంతయు చాటబంపెను. కాని యీ దుర్ఘటకార్యమున కెవ్వరు పూనుకొనజాలరైరి.

నారాయణశర్మయు నిజేవాసమునకరిగి అచ్చటనుండికూడ, పరిచారకులనుబంపి అన్నిప్రదేశముల యందును, వెతకించి విఫల మనోరథుడయ్యెను. పాండురంగడును తండ్రినిమిత్తమై విశేషముగ రూకలను వెచ్చించెను. కానియాతనిజాడ లెవ్వరు నావంతయు నెరుంగజాలకెంతయు జింతించుచు కాలముగడుపుచుండిరి.

నాటినుండి సుభద్ర అన్నపానాదు లొల్లక మనోవ్యాధిచే కృసింపుచుండెను.

మరునా డుదయమున విజయవర్మ పెందలకడ మేల్కాంచితిరుగ నాయరణ్యమార్గముననే పోవుచుండెను. యిట్లు కొంత దవ్వరిగిన పిమ్మట మరికొంతదూరమున ఆకసమున గ్రద్దలాడుచుండుటంగాంచి అచ్చటనీరములుండ వచ్చునని గ్రహించి, జాడ

లనుబట్టియాప్రదేశమున కరుగనచటనొక గొప్పతటాకము గాన్పించెను. అచ్చటతాతడు దంతధావనముజేసి కడుపార నీరమునుగ్రోలి తిరుగపిక్కబలమును జూపెను. విజయవర్మకు,రంగనిమరచినందుకు అతడేమిచేయునోననియు,దైవమెంతసహాయ్యమొనర్చినను సమయమునకు మందమతి నైతిననియు, దానంచేసి రంగడు తన్నువిడచి పోయెననియు, తిరుగనాతనికృపకెంతయు పాత్రుడనయ్యెదననియు, తలంచి, తానేమిచేయునది, యిప్పుడెచ్చట నుండునది నెరుంగక ఏక దీక్షాపరవశుండై పోవుచుండెను.

ఇట్లొక కాలిమార్గమునుబట్టి పోవుచుండ నదియొకకొండ ప్రదేశమై యుండెను.

దుర్గమ ప్రదేశమైనను, ఆవంతయు సంశయింపక బహుదూర ప్రయాణ మాచరింప నొక్కయెడనొక గొప్ప ఫుద్యానవనముగాన్పట్టెను. ఆవనప్రదేశమెంతయు, నానందకరముగగన్పట్టుచు, చూచువారికెంతయు నానందాబ్ధి నోలలాడింపఁజేయు చుండెను. వనములోని పచ్చిక బయళ్ళపై లేళ్ళమందలు నిర్భయముగ మేయుచుండెను. వెండియు, నందొకకొలను నిర్మలజలపూరితములై జలపక్షులకెంతయు నానందముఁగూర్చుచుండెను. చెట్లపై చిగురుటాకులు బక్షింపుచు, కోవెలలు మధురముగ కూయుచుండెను. నెమళ్ళు పింఛములనిప్పి శృంగారముగ నృత్యముఁజేయుచుండెను. వానరమూకలు తమ తమ బిడ్డలను పొట్టల నతికించుకొని వక వృక్షము నుండి మరి యొక వృక్షముపైకి దుముకుచుండెను. బహు పురాతన

ములగుటంజేసి వృక్షశాఖ లోఁడోరు లోరసుకొని ఫల, పత్రి పుష్పపూరితములై సూర్యకిరణముల కణుమాత్రమైనతా వోసంగక చల్లనినీడనిచ్చు చుండెను.

అంత నా విజయవర్మ వనముఖద్వారము కడకేగి నలుదెసలం బరికింప రకరకముల పుష్పలత లచ్చటచ్చట గాననయ్యెను. ఆ పొరుడింకను, వనచిత్రములను పరికింపనెంచి, యింత శృంగారమగు వనము నిర్మానుష్యమై యుండుట కేమిగతంబని తలంచుచు, నాలుగడుగులు ముందుకువైచి, వనముఖద్వారముయొక్క కవాటము బంధించి యున్నందు నాత డెంతయు నిరుత్సాహుఁడై, ద్వారముయొక్క తలుపుఁను తన హస్తముచే కదలించెను. అంత నాద్వారక నాట మదేమిచిత్రమోకాని తనంతనే తెరువంబడెను.

విజయవర్మ దానికెంతయు నచ్చెరువొంది లోనం బ్రవేశించునంతలో రివ్వుమని గాలివీవ, వనపుష్పములు మరింత కమ్మని తావు లొసంగుటయేగాక, చెట్లనుండి విజయవర్మ శిరస్సుపై శుభసూచనములు గన్పట్టుచున్నట్లు జలజల పూలురాలెను.

మరికొంత లోనికేగి కొలనులోని రుచ్యములగు నీరమును గ్రోలి వనశృంగారములను కన్నులపండువుగ తిలకించు చుండెను.

ఇట్లతడు వినోదముగ కాలముగడుపుచుండ, కొందరు మునిబాలు రాతని చెంత కరుదెంచి, అయ్యా తమరెవ్వరు ? నిరంతర భగవధ్యానా తత్పరులకు దప్ప అన్యులు ప్రవేశింప నలవిగాని యీపుణ్యవన మెట్లు ప్రవేశింప గలిగితిరని ప్రశ్నింప నా విప్రి

శ్రేష్ఠుండు, మృదుమధురమగు మునిబాలుర పల్కులాలించి వారి వంక తేరిపారచూచి బాలులారా! కేవలము భగవధ్యాన్నా తత్పరులకుదప్ప, యితరుల కలవిగాదని చెప్పుట కేమి యాధారమని యడుగ, నామునిబాలురు, యీవనముఖద్వారము విష్ణుభక్తులకు దక్క దక్కుంగల వారి కెవ్వరికిని తా వొసంగదని ప్రత్యుత్తర మిచ్చిరి.

అటులైన తాను నొక మందభాగ్యుడనగు విష్ణుభక్తుడనే యని పలికి యీ ఉద్యానవన మెవ్వరిదని ప్రశ్నింప నా బాలకులీతని దీనవదనమున కెంతయు జాలిపడి యీపుణ్యవన మెవ్వరిదని చెప్పగలము, నిష్పక్షపాతముగ దైవభక్తిగలిగి యిందు ప్రవేశింప నెవ్వరికి శఖ్యమగునో వారందరికిం దధికారము గలదని చెప్పుచు, తమ రేదియో దీర్ఘాలోచనాతత్పరులైయుండినట్లు కాన్పట్టుచున్నది. మెండియు క్షుద్బాధా పీడితులై యుండినట్లు మీా ముఖకాంతింబట్టి తెలియుచున్నదని విజయవర్మను తమయాశ్రమము నొద్దకు గొంపోయి రుచ్యములగు ఫలాదులచే తృప్తిపరచి తమ గురువుగారిప్పటికపూర్వకాలముననే పద్మాసనాసీనులై భగవధ్యాన్నము నంకున్నాడనియు, వారు లేచువరకు తమకడ నుండుడని విజయవర్మ కుచితమర్యాదలం గావించి సత్కరించిరి.

విజయవర్మయు వన చిత్రములను జూచి యానందించుచు మధ్యమధ్య తన పూర్వచరిత్రమును దలచి చింతించుచు, వనమందెల్లెడలను ద్రిమ్మరుచుండెను.

పండరినాథుడును, విజయవర్మ కడగండ్లను కన్నులార గాంచుచు, తనభక్తుని దురవస్థ కెంతయు విచారింపుచు, తన్ను మరచినందు కెంతయు కోపించుచు, నతనిని కాచియుండెను.

అంత నావాసుదేవుడు, తన్ను ధ్యానింపుచుండిన మౌని వర్యుని మానాన స్తయం దేమేమియో జెప్పి, మునివర్యా యీ కమండలము నందలి రహస్యములను నాభక్తునికి విశదపరచి దాని నొసంగుమని చెప్పినట్లు జడదారి దిగ్భ్రమ జెంది కన్నులందెరచి, వాస్తవ మారయుట కందొక కమండల ముండుటం జేసి దానినెత్తి కన్నుల నద్దుకొనుచు నపరిమితానంద భరితుడై వనప్రదేశ మంత యు మారుమోగ నొక కేకవైచెను. అంత నామునిబాలు రెల్లరు గురువుగారిని మున్ముందు దర్శించుకొనవలయునని బాల్యచాపల్య మున రివ్వుమని పరువిడి రెప్పపాటులో ఆజడదారిం జేరిరి.

అంత నామౌనియు వారిరాక కెంతయు సంతసించి, నూతన వ్యక్తివ్వ రేని మనపుణ్యవనమునందు దిమ్మరుచుండ మీ రెవ్వరైన గాంచియుంటిరే? యని ప్రశ్నింప, తమవెంటనున్న దీనవదనుడైన విప్రశ్రేష్ఠుని జూపెట్టిరి.

ఆమౌనివర్యుని ఆగమనశక్తి కాతడెంతయు నచ్చెరు వంది ముకిళితహస్తుండై శ్రీరామునియెదుట హనుమంతునిం బోలె నా విజయవర్మ మౌనికెదురుగ నిలువంబడెను.

అంతట నా మునికులతిలకుండు తన శిష్యబృందముంగాంచి మీరికజేని మీమీకృత్యములను జేకొట్టుడని పల్కనదితడవుగ వారట్లు గావించిరి.

అప్పుడు ఋషిశ్రేష్ఠుండా పారుని వంక తేరి పారజూచి భక్తాగ్రేసరా! నీ యుదంతంబంతయు నేనెరుంగ గల్గితిని. తుచ్ఛ సుఖముల శాశ్వతములని యెరింగియు, నంధకారమున గన్నుగానక చేసిన పనికై వగవకుము. కర్తవ్య ముపదేశించెద నాల కింపుము. అట్లు గావించితి వేని నీవొనర్చిన పాపముం బాయగలదు లేదేని నీకిహపరములందు ముక్తిదొరుకదని బల్కు నావిజయవర్మ సంతుష్టాంతరంగుడై మునిపాదముల కొరగి నోమహాత్మా తమ రేమి చేయుమన్నను చేయుట కీదాసుడు శిద్ధముగ నున్నాడని పల్కెను.

అంతట మౌనివర్యుండా విప్రవర్యుంగాంచి, ఓపుణ్యాత్మా నీవీతక్షణము పాదచారుడవై పండరీ క్షేత్రము దర్శింపబోవుము. పండరియు యిచ్చటి కనతిదూరమున యుండుటం జేశి షుమారు నాలుగు మాసములనాటికి నీవచ్చటికి చేరగలవు. ఆదివ్య క్షేత్రమున సమస్తపాప వినాశినియగు చంద్రభాగీనది గలదు. దాని యందు జలకమాడి, పండరీనాధుని దర్శించినంత మాత్రముననే మందమతివై నీవొనర్చిన దుష్కార్య ఫలితములెల్ల నశించునని చెప్పెను.

విజయవర్మ ఆమాటల కెంతయు సంతసించి, మునికులసార్వ భౌమా యిప్పుడే ప్రాంతము నందుండువది యెరుంగజాలని నేను పండరిపుర మార్గమెట్లు తెలుసుకొనగలను, మరియు, మార్గమధ్యంబు ననేక దుర్గమారణ్యములుగలవు, వాని నెట్లొంటిగ దాట

గలనని వేడుకొను నామాని చంద్రుడు పక్కనననివ్వ వెర్రిపారుడా స్వప్రయత్నమున పాదచారుడవై నీవెన్నటికిని పండరిచేరజాలవు. భగవంతు డెప్పుడును తనభక్తకోటి యోగక్షేమముల నారయుచు వారి సత్ప్రవర్తన కెంతయు పాటువడి తన్ను దర్శింపంబోవు ప్రతి వ్యక్తి మనమునం దైక్యమై తానే తనక్షేత్రమునకు గొంపోవ గల డని పల్కుచు వెండియు, నిదిగో నీ కమండలము గైకొనుము. దీని ప్రభావమంతయు జెప్పెద నాలకింపుము. యిదియే భగవం తుని దర్శింపంజేయునావ, యీకమండలము నీకు చెలికాడై మార్గ మును జూపుచుండును. తలచినంత మాత్రముననే కల్పవృక్షము పగది సమస్తభోజన సామాగ్రి నొసంగగలదు. వెండియు భూత భవిష్యత్ వర్తమాన సమాచారము లీ కమండలమువల్ల తెలియ గలవని దాని మహిమంబంతయు పూసగుచ్చినట్లు విశదపరచి నాకమండల మాయనఘున కొసంగెను.

అంత నాపారుడు, యింకను సంశయించువానివలె గాన్పట్టు తరి, వాని యుదంతంబెరింగి నోవిప్రవర్యా, సంశయించెద వేల నీ కోర్కె లెరింగింపుమని పల్క ఋషిచంద్రమా ! తమ కిష్టమైన శిష్యు నెవ్వరినేని యొక్కనిని నావెంట నంపితిరేని దివ్యక్షేత్రం బగు నాపండరిని వానింగూడ దర్శింపంజేసి నా పుత్రునింబోలె వానిని కడుప్రేమతో నాదరించి తిరుగ మీకప్పగించెదనని పల్కెను.

అంత నా మౌనివర్యుండు తన శిష్యులందరిని రావించి, మునిబాలకులారా ! యీమహాసీయుడొక విష్ణుభక్తుడు. విధివశం

బున నేకాకియై దిమ్మరుచున్నాడు. యిప్పుడీవ్యక్తి దివ్యక్షేత్రమై భక్తులకెంతయు నాటపట్టై యొప్పారు పండరిక్షేత్రమున శ్రీ పాండురంగని దర్శింప నేగనున్నాడు. మీలో నెవ్వరేని యీ యన ఘునికి సహాయ్యముగ నేగి నిత్యభోగిని యగు నా చంద్రభాగి యందు జలకమాడి, దివ్యస్థలంబగు నాపండరిపురంబున, పుండరీకాక్షుని దర్శించి రాగలరా? యని పల్కినది తడవుగ, వారంద రేకగ్రీవముగ మహాభాగ్యమనిరి.

ప్రతిబాలుడును నేనేగెదనని పల్కుచు వారిలోవారు పెనగుచుండునంత నాజడదారి, బ్రాహ్మణోత్తమా వీరిలో నీ యిచ్చ వచ్చినవారిని గొనుమన నాబాలురందరు విజయవర్మ ముఖమును దీనవదనులై చూచుచుండిరి.

ఆసమయమునం దాపారుడు తనకునచ్చిన నొకవిప్రబాలుం గొని మునియాజ్ఞంబడసి, విజయవర్మయు, కాషాయవస్త్రములను ధరించి కమండలముచేనంది పుండరీకాక్షుని ధ్యానించుచు పండరి మార్గముఁబట్టి పోవందొడంగెను. ఆవిప్రబాలుండును గురువుగారి యానతింబడసి శంకరునివెన్వెంటబోవుకుమారస్వామివలెనావిప్రుని వెన్నంటి కొంతదవ్వరిగినపిమ్మట, విజయవర్మ ఆ బాలునిం గాంచి మునిబాలకా నీనామధేయమేమనియడుగ "స్వామీ" నన్ను మణికంధరు డందురని బదులిడెను.

అంతట వా రిరువురును పాదచారులై కొండలు, గుట్టలు, అడవిమార్గంబుల నెక్కుడుగ నడచి నిర్జనారణ్యముఁ బ్రవేశించినవారై యొకటవమజిలీ చేరిరి.

# పండరి మజిలీ కథలు.

(అను పాండురంగ మహాత్మ్యము)

## వకటవ మజిలీ.

( వక నిర్జనారణ్యమై యున్నది. )



అట్టి ఘోరారణ్యమిా మునికుమారుండు మున్నెన్నడు యెచ్చటను గాంచియుండలేదు. దానంజేసి మునిబాలుడా విప్రునింగాంచి, స్వామిా! యీ ఘోరారణ్యము చూడంజూడ నాకెంతయు భయోత్పాతము గొల్పుచున్నది. కనుచూపు మేరెచ్చటను మనుష్యమాత్రుడీ ప్రాంతమున బొడగట్టుట లేదు. నలువైపుల నుండు కొండప్రదేశములనుండి దుష్టమృగము లాకలి బాధచే గాబోలు దిక్కులు పిక్కటిల్లునట్లార్భాటముగ నరచుచున్నవి. వాటి యార్భాటపు కూకలకు హాయిగ పచ్చికబయళ్ళపై మేయు లేళ్లమందలు చల్లాచదరై ప్రాణ భీతిచే నల్వంకలకు పారదొడంగెను. గావున యిట్టి నిర్జనారణ్యమున మన మేలబస చేయ వలయును. మరికొంత దూరము ప్రయాణము గావించినచో యెద్దియేని పట్టణము గాని, పల్లెగాని గాన్పింపక మానదు. అచ్చట మనము హాయిగ వంట ప్రయత్నము గావింపవచ్చునన మునిబాలుని మాటల కాపారుడు చిరునవ్వుతో మణికంధరా లోకైకపూజ్యుడైన ఆపుండరీకాక్షుని దర్శింపబోవు

మన కేలాటి ముప్పును, వాటిల్లదు. నీవావంతయేని భీతిజెందకుము సాయంసమయమువరకు మనముప్రయాణము గావించినను, వూరు గాని, పట్టణముగాని గాన్పింపదు. యింకను, యీదుర్గమప్రదేశము నందు రెండుదివసములు నడువవలయును. కావున క్షణమాత్రమున వంటగావింపుము. త్వరగాక్షుద్బాధతీర్చుకొని వెంటనేప్రయాణము సాగింతమని పల్కి నాచిరుత బ్రాహ్మణుడు వల్లెయని తమయొద్ద నుండు నొకపాత్రమును గైకొని చేరువనుండు నొక తటాకములో జలకమాడి యాపాత్రము నిండుగ శుద్ధోదకమును గొనివచ్చు నంతలో విజయవర్మ తనకమండల పరిభావమున సర్వేశ్వరుండగు నాపండరినాథుని నిశ్చల మనస్సుతో ధ్యానించినంత మాత్రముననే సమస్తవంట సామాగ్రిని బడయగలిగెను. కమండలపరిభావమిదియే మొదటి పర్యాయమున గాంచుటంజేసి విజయవర్మ దాని కెంతయు సంతసించి తనయదృష్టమున కెంతయు నుబ్బుచుండెను.

మణికంధరుడును యీభయంకరా రణ్యమును జూచినప్పటి నుండియు భయోత్పాతు డగుటంజేసి త్వరలో వంట పూర్తి గావించెను. యింతలో విజయవర్మయు జలకమాడి సంధ్యావం దనము న్గావించి మణికంధరునితో తృప్తిగ భుజించి మణికంధ రునిగాంచి, కుమారా! యించుక శేపీ వటవృక్షముఛాయ మార్గ, భుక్తాయాసములు చల్లాచదరై పారునట్లు విశ్రమించిన పిమ్మట ప్రయాణమును సాగింతము. యింతలో సూర్యభగవానుడును, తన వేడిబాణముల తీక్షణమును తగ్గించగలడనిపల్కి మణికంధరుడును

గురువుగారి మాటకు వల్లెయన నిముషమాత్రముననే విజయవర్మ గుర్రుపెట్టి నిద్రించెను.

పాపమీవిప్రబాలునికి మాత్రముభీతిచే నిద్రపట్టినదికాదు. ఆతఁడును గురువుగారు మేల్కొనునంతవరకు నచ్చటనే యొకచో గూలంబడి, యే దుష్టమృగమైనను వచ్చి తమ్ము మ్రింగిపోవునను భయముతో నలువైపుల పరికించుచుండెను.

ఇట్లామునిబాలుఁడుదిక్కులుచూచుచుండ యాబదిగజముల దూరమున నొకచో నొద్దియో, సూర్యుని ధిక్కరించుచు, తనకాంతిని సూర్యకాంతికి వేమడంగు లధికముగ ప్రసరింప జేయుచుండుటం జూచి కన్నులు మిరుమిట్లు గొల్పుచుండినను అదేమిచిత్రమో చూడ నుత్సాహుఁడై దాని దరికేగి పరికించిచూచి ఆవెలుగేదైనది తెలుసుకొనజాలక దీర్ఘముగ నాలోచించుచు, "ఓహో," తెలిసినది సూర్యునికాంతికన్నను వేమడంగు లధికముగ ప్రకాసించునది భూలోకమునగాదు, మరేలోకమున గూడలేదు. కావున సూర్యభగవానుడు తానాకాశమునందు తనకిరణములు వెలుంగజేయుచు తనకొమారుని భూలోకమున కంపెనని నిశ్చయించుకొని అట్లైన నీ సూర్యతనయుండు కిరణములు ప్రసరింప జేయుచున్నాడే కాని తనతండ్రింబోలె వేడిబాణము లెదజల్లకుండుటకు కారణమెద్దియుని మఱికొంత చేరువకరిగి తనచేతితో నాభూలోక సూర్యతనయునెత్తి చూడవలయునని యెంతె బలవంతముగ తన భుజబలము చూపినను వీసమాత్రమును కదలకుండు కెంతయు నచ్చెరువొంది, యిదియేది

యో దేదీప్యమానముగ వెలుంగుచున్న రత్నమనియు, దుష్టమృగ ములు సంచరించు నీయరణ్యమున రాత్రియందు ప్రయాణము గావించు మార్గస్థుల కావంతయు భయములేకుండుటకే మహ నీయుడో స్థాపించి యుండుననియు, యిది పాతాళలోకము నంట భూమిలో పాతిపై చిరనియు, పగటికన్న రాత్రులందు విశేషముగ ప్రకాశింపగలదనియు గ్రహించి, యింకను, దాని సమాచారము పూర్తిగ తెలుసుకొనగోరి వేవేగ తనగురువుగారిచెంత కరిగెను. ఆమహనీయుడును మేల్కాంచి ఆ ప్రాంతమునందే ద్రిమ్మరుచున్న ప్రియశిష్యునిం గాంచి యిక మనప్రయాణమును సాగింతమాయని పల్క నాచిరుతపారుడు, స్వామీ! ప్రయాణమున కేమిగాని, అదిగో ఆగుట్టచేరువున కోటిసూర్యప్రకాశమై తనకాంతి సూర్య కాంతిని మాటు పరచినట్లు వెలుంగుచున్న రత్న మిచ్చ టెవరు స్థాపితముజేసిరి? యంత పెకళించినను, అణుమాత్రమును కదల కుండుటకు కారణమెద్ది? యీ ఘోరారణ్యమున రాత్రులు సహిత మివ్విధంబుననే ప్రకాశించు చుండునా? దీని విచిత్రచరిత్రమెరిం గింపుమని వేడుకొనజొచ్చెను.

అంతట నావిజయవర్మ తన కమండల ప్రభావమున దాని యుదంతంబాతయు దెలిసికొని, మణికంధరా! దీనిచరిత్రము వివ రింపుటకు చాలా కాలయాపనమగును. దుష్టమృగముల కాటపట్టై యుండు యీ యరణ్య ప్రదేశములో మనము విశేషముగ జాగు చేయరాదు. దీనిచరిత్రము ముందురాబోవు మజిలీలో వివరముగ

దెల్పెదనన నాబాలుడు స్వామీ! దీని విచిత్ర చరిత్ర మెద్దియో తెలిసికొనునంతవరకు యీ ప్రదేశము వదలుటకు నాకు బుద్ధి పుట్టుట లేదు. నడచుటకు కాళ్ళు రాకున్నవి. దీనికి నేనేమిచేయ గలను? మీరును భుక్తాయాసముగ నున్నవారు యింకను యెండ తీక్షణము తగ్గినదికాదు. కావున నాయందు పరిపూర్ణ కటాక్షముంచి దీనియుదంతం బంతయు నెరిగింప జేయుడని, విజయవర్మ పాదములనంటి దీనవదనుడై ప్రార్థించిన విజయవర్మ నెంతయు జాలినొందినవాడై ఆరత్న చరిత్ర మివ్విధంబునఁ జెప్పందొడంగెను.

# రత్నము యొక్క కథ.



తొల్లి సుగుణఘట్టమను పట్టణమును కిశోర శింహుడను రాజు పాలింపుచుండెను. ఆరాజ పరిపాలనా కాలములో ధర్మము నాలుగుపాదముల నడచుటంజేసి సకాలమున వర్షములు కురియుచు వసుంధర పుష్కలముగ ఫలించుచుండెను. ఆరాజున కనుకూలుడును,నిరంతరము రాచకార్యా దురంధరుడును, రాజయోగక్షేమముల కొరకు పాటుపడు వాడును, అగు చంద్రవదనుడను మంత్రిప్రమ్మహనీయుని పరిపాలనకు సహాయ్యుడై మెలంగుచుండెను.

చంద్రవదనుడు సుగుణఘట్టమున కనతిదూరమున నుండు గోపాల పురవాసుడు, బాల్యమునందె తల్లిదండ్రులను కరవుజేసి కొని నందున, విజయ బలిపురమునందు, వుదారశింహుడను తన

మేనత్తపెనిమిటింట పెరుగుచు స్వల్పకాలములోనే సమస్తవిద్యల యందు దారితేరినవాడయ్యెను. వుదారశింహుడును సుగుణవతియును చక్కని తన కొమార్తె నాచంద్రవదనున కొసంగి నొక సుముహూర్తమున పాణిగ్రహణమహోత్సవము గావించెను.

కాని తన అల్లుని కేదేని వున్నతోద్యోగము నిప్పించవలయునని బహుకాలము, తన కనుకూలురైన రాజుల నందరి నాశ్రయించెను. వుదారశింహుడును ఆప్రదేశమునందు గొప్ప పలుకుబడిగల కుటుంబమునకు సంబంధించినవ్యక్తి.

వుదారశింహుడు, సుగుణఘట్టపతియగు కిశోర శింహునికి కేవలము సమీపబాంధవ్యుడు. కొన్నికారణములవల్ల వుదారశింహుడు రాజ సంస్థానమునకేగుట మానివైచెను. ఒక్కపరి సుగుణఘట్టమున కిశోరశింహుని సోదరియగు యిందిర కెద్దియో గొప్ప వ్యాధి సంభవించి బహుకాలమునుండి బాధించుచుండెను. అనేక దేశములనుండి రాజసంస్థానములకు చెందిన వైద్యులను రావించి చికిత్స చేయించుచుండెనేగాని పాప మా యువతి కా బాధతగ్గినది కాదు. వుదారశింహుడు అప్పటికాలములో గొప్ప నాటువైద్యుడు. తన స్వంతద్రవ్యమును వెచ్చించి బీదల కుచితముగ చికిత్సలు జేయుచుండెను. కిశోరశింహునితో గ్రామ ముఖ్యులందరు వుదారశింహుని రావించితిరేని యిందిర కీవ్యాధి త్వరలో కుదురగలదని చెప్పుచుండిరి.

దానంజేసి కిశోరశింహుడు, విజయబలిపురమునకు చారుల

నంపి వృదారశింహుని రావించెను. సుగుణ ఘట్టమున రాజును దర్శించుట కుదారశింహునకావంతయు నిష్టము లేదు. కాని, చిన్న తనమునుండియు నల్లారుముద్దుగ బెంచిన యిందిర కింతటిముప్పు వాటిల్లినందు కగత్యముగ సుగుణఘట్టమున కరుగవలశి వచ్చెను. కిశోరుడును పూర్వము వలెనే వృదారశింహుని కడుంగడు శ్రద్ధతో నుచిత మర్యాదలం గావించి, యిందిర దుస్థితిని గురించి ముచ్చ టించుచు తాను కంట తడిబెట్టుచు, రోగపీడితురాలైన నామె సౌధమునకు గొంపోయి జాడ్యచర్యలన్నియు నుదారశింహుని కెరుక పరచెను. యిందిరయు, వృదారశింహుని బహుకాలమునకు జూచినందు కెంతయు సంతసించుచు, తానిక జీవింపననియు, అల్ప కాలములోనే భగవంతునిలో నైక్యమగుటకు సిద్ధముగ నున్నానని చెప్పుచు నేడ్వసాగెను.

వృదారశింహు డామెకు ధైర్యముఁ జెప్పి తానా నాటి నుండియే దివ్యవృషధ మొసంగు చుండుటం జేసి స్వల్పకాలములోనే శుక్లపక్షమినాటి చంద్రునింబోలె నా రాజ సోదరి అరోగ్యవంతు రాలయ్యెను.

వృదారశింహుని సహాయ్యమున కెంతయు సంతసించి కిశోరు డాతనికి కొన్ని రత్నములును, బంగారు నాణెముల నొక పళ్ళెరమున నుంచి బహూకరింప నుంకించుచుండ నుదారశింహుడు వాని నొల్లక తన పరిపాలనకు చెందిన యే శాఖయందేని తన అల్లుడగు చంద్రవదనున కున్నతోద్యోగము నిప్పించుమని పల్కినదితడవుగ

నాతని రప్పించుటకొరకు కమ్మ వ్రాసి కొందరి నశ్వరూఢులను విజయ బలిపురమున నుదారశింహుని యింట నుండు చంద్రవదనుని రావింపుడని యాజ్ఞాపించెను.

చిరకాలమునుండి తగిన బుద్ధిశాలియు, చతురతగలమంత్రి తనకు తటస్థముగామిచే చంద్రవదనుని గుణగణములి దివరకు విని యున్నందున ఆతనికి తన యాస్థానమునందు మంత్రి పదవి నొసంగుటకు ముఖ్యకారణమై యున్నది.

వుదారశింహుడును కిశోరుని బంధుభక్తి కెంతయుసంతసించి రాజాజ్ఞన్బడసి నిజవాసమున కరిగెను.

చంద్రవదనుని భార్య సుగుణవతియు సార్ధక నామ ధేయముగల యువతి. కిశోర శింహుని యర్ధాంగియగు సత్యవాణి సహిత ముదారభావము గల రాణి. తనకు సమీప బాంధవ్యు డగుటంజేసి, కిశోర, చంద్రవదను లిర్వురును శ్నేహభావముగను, బంధురీతిగను వర్తింపు చుండిరి. యిట్టి విధంబుననే సత్యవాణి, సుగుణవతులు సహిత మన్యోన్యముగ మెలంగుచుండిరి.

తనభర్త రాజ కచ్చేయందున్నప్పు డెల్లను సుగుణవతి రాజాంతఃపురమున సత్యవాణితో పూర్వపుణ్యవతుల చరిత్రము లను పఠన జేయుచుండెడిది.

అదేమిచత్రిమో కాని అల్పకాలములోనే రాజ, మంత్రి కుటుంబముల కన్యోన్య మైత్రికలిగెను. మంత్రిపదవి శిరసా వహించిన కొద్దికాలములోనే. ప్రజలాతని సత్పరిపాలనము కెంతయు

శ్లాఘించు చుండిరి.

సమస్త వైభవముతో తులదూగుచు నారాజ, మంత్రి భార్య లిరువురును, తమతమ పతుల కెంతయు సంతసమును గూర్చుచు బహుకాలము సంతోషాంబుధి నోలలాడుచు పతిభక్తి గలిగి చరింపు చుండిరి.

ఒకానొక సమయమున కిశోర శింహుడు మంత్రి సమేతముగ కచ్చేరిచేయుచుండు నంత నొక శేవకు డా కిశోరశింహుని దరికరు దెంచి, మహాప్రభూ, తమదర్శనమున కెవరో వ్యక్తి ద్వారము నందు వేచియున్నాడు. అతనింజూడ నాకెంతయు భయ ముద్భ వించినది. తన విశాలముఖమున భగవంతుండగు నారామ నామ ములను దిద్దుకొని శింహచర్మముం బోలె నేదో నొక ఉన్నివస్త్ర మును మేనునిండుగ గప్పుకొని, దేవరమేనా, మోయు చాకలి వాని చేతనుండు నట్టి నొక కర్రను చేతంబట్టుకొని లోక విరుద్ధ ముగ చక్కతో నమర్చబడిన పాదరక్షలతో నరశింహావతారంబు వలె కానృట్టుచున్నాడు. ఆజ్ఞయయ్యేనేని సీఘ్రముగ ప్రవేశింప జేయుమనన త్వరితముగ నారాజదర్శన కుతూహాలుని ప్రవేశింపం జేయుమని పల్కినది తడవుగా భటుడు చిత్తమని వెడలిపోయెను.

కిశోరుడు ఆవ్యక్తెవ్వరై యుండవచ్చును. యుద్ధసన్నిద్ధులై యితరరాజు లెవ్వరును ముందుగ యుద్ధమునకు శిద్ధముగ నుండు మని పంపిన రాయభారి కాదుగదా? అట్లయ్యేనేని యిప్పు డల్ప సైన్యముగల మనకు ముప్పు తప్పక వాటిల్లునని చంద్రవదనునితో

పిఠికిమాటలాడ, చంద్రివదను డారాజుమాటల కెంతయు తృణీ కారముగ రాజా! నీవేల భీతిజెందెదవు. అల్పసైన్య మైనను, అధిక సైన్యమైనను, శైన్యహీనమైనను చంద్రివదనుడు తమచెంతనుండు వరకు దేవర కేలాటియాపదయు సంభవింపదు. అదియుం గాక శేవకుడు చెప్పుమాటల ననుసరించిచూడ ఆతడెవ్వరో యాచ కునివలె తెలియుచున్నదని రాజునకు ధైర్యముం జెప్పు చుండెను.

రాజశేవకుడును, ఆరాజదర్శన కుతూహలుని దరి కేగి మారాజిపు డేవియో కొన్ని రాచకీయ వ్యవహారములు మంత్రు లతో ముచ్చటించు చున్నాడనియు, రాజుగారిని దర్శింపుటకు వే రొక పర్యాయము రావలశినదనియు, చెప్పెను. అంతట నావ్యక్తి రాజును దర్శింపుట కిదియే మంచితరుణమని యెంచి యా రాజ భటుని జూచి నీ వేవిధంబుననైన సరియే యీ సమయమందు రాజును దర్శింపం జేసితివేని, నీ కేదైన బహుమాన మొసంగెదనని బ్రితిమాలజొచ్చెను. ఆభటుడు తన పాచిక పారినదని నుబ్బుచు అటులైన రండు రాజున కేవియో కొన్ని సంగతులనుజెప్పి దర్శింపం జేయుమనని నాయాచకుని గొంపోయి రాజున కప్పగించెను. కిశో రుడా మహనీయుని తిలకించి, యీతడొక గొప్పవిష్ణుభక్తుడనియు, తన్నేదియో యాచింపవచ్చెననియు, యెరింగి బ్రతుకుజీవుడాయని తన యాతురత నుడిగి తాను మంత్రిసమేతముగ నా మహనీయు నెదుర్కొని వారికి సాష్టాంగ దండప్రణామ మాచరించి ఆ వైష్ణ వుని యాశీర్వచముల న్బడసి వుచితాసనా సీనునిం గావించిరి.

మంత్రిపుంగవుడగు చంద్రవదను డామహానీయునింగాంచి, స్వామీ! తమదేయూరు, యిచ్చటికి మమ్ము పావనులంజేయ నరుదెంచుటకు కారణమెద్ది. పుణ్యాత్ములగు తమచరిత్రము మా నరపాలున కెరింగింతురే? యన, నా మహానీయుడు, కిశోరశింహా మహారాజా, కల్పతరువువలె కోరినకోరిక లిచ్చునదియు, భక్తులకు సదా సంతోషమును గూర్చునదియు, తనపావన జలముచే నిమేష మాత్రమున పాపాత్ములను పుణ్యాత్ములుగ మార్పుజెంద జేయునదియు, దేవదేవుండగు, ఆదినారాయణుఁడు వైకుంఠము న్విడచి లక్ష్మిసమేతముగ నివసించు నదియు, భక్తులకు తృప్తి నొసంగుచుండినదియు, త్రికరణశుద్ధిగల విష్ణుభక్త పూరితమైనదియు, నేటి వరకును నీవెరుంగనిదియు, హిందూమత రక్షకుడును, భారత స్త్రీల మానసంరక్షకుడును, మహారాష్ట్ర సేనానాయకుడు నగు, శివాజి మహారాజు జన్మస్థానమునకు సమీపమున నుండు నదియునగు, పుండరీకాక్ష పురంబున నొప్పు పండరిపురము మాకు జన్మస్థానము.

విష్ణుభక్తులను పూజించుటయు,బహుదూరమునుండి పాండురంగని దర్శింపవచ్చు పుణ్యాత్ములను సత్కరించుటయు, తులసీదాస్, నామదేవు, సక్కుబాయ్, మున్నగు, నిజభక్తులు భగవంతునిలో నైక్యమైనపిమ్మట వారి జ్ఞాపకార్థమై యేర్పరుప బడిన ఆలయములను, వారి కెరింగించి ధన్యులంజేయుటయు, వెండియు నాపండరిమహాత్మ్యము వారికి విశదీకరింపుటయు, తీరిక సమయ

మం చెప్పుచును దేశదేశములను దిరిగి మిమ్ముబోంట్ల నాశ్రయించి ధనమును సంపాదించి వర్షమునకొకతూరి పాండురంగని సప్తాహ మొనరించి బీదల కన్నవస్త్ర దానమొసంగుటయు నాకు ముఖ్యో ద్యోగమై యున్నది.

కావున నో కిశోరరాజా, ధర్మదాతవనియు, కవిపోషకుండ వనియు, దైవభక్తి పారాయణుడవనియు, వేనోళ్ళశ్లాఘింప విని నిన్నాశ్రయింప వచ్చితిని. రాబోవు పండరి పురమున జరుగు సప్తాహమునకు వలయు ద్రివ్యసహాయ్యము నీవు గావింపుమని పల్క, కిశోరుడా మహానీయుని పల్కులకెంతయు సంతసించి, తగు ద్రివ్యసహాయ మొనర్ప నుద్యుక్తుడై యుండ, నాతని యుదంతం బెరింగి, చంద్రవదనుడు వలదని వానిని వారించి మహారాజా, యిది కలికాలము. దేశమునందు లెక్కకు మిన్నయగు ననేకవ్యక్తు లిట్టి మాయా వేషధారులై అన్నదానములను జేసెద మనియు తమ బిడ్డల కుపనయనము లొనర్చెదమనియు, మార్గస్థుల కుప యోగముగ, భావులను చెరువులను, త్రివ్వించెద మనియు యా చించి ద్రవ్యమును గొంపోయి తమతమ స్వకార్యములకు విని యోగపరచుట లోకసహజమైయున్నది. వేయేల, యేదానమొసం గిన నొసంగుదురు గాక, ధనదానము మాత్రము గావించుట శ్రేయస్కరము గాదు. పూర్వమొక భూపాలు డిట్టులే ధనదాన మొసంగినందున, తానొనర్చిన యితరదానము లన్నియు మాటు పరుపబడి, పడరాని యిడుమలంబడెను. దానియుదంతం బెరింగిం

చెద నవధరింపుడని చంద్రవదను డా కిశోరశింహున కిట్లుచెప్పఁ దొడంగెను.

పూర్వకాలమున కొంకణదేశమును పాలించు సర్వదమను డను రాజు బలిచక్రవర్తింబోలె నిరంతర మన్నదానము జేయుచుం డెను. ఆత నన్నదానమహిమ మదెట్టిదోగాని దేవతులు సహిత మానరనాథునకు తోడ్పడుచుండిరి. త్రిమూర్తులు తమతమ సతు లను, వంటచేయుట కమ్మహానీయునింట మారువేషమున దిమ్మ రింప జేయుచుండిరి.

ఇట్లు బహుకాలమా నరపతి అన్నదాన మొనర్చుటంజేసి కలియుగ బలిచక్రవర్తియను బిరుదము వహింప తనకీర్తి నలుదెస లను వ్యాపించెను. సమస్తదేశముల నుండి బీదజనులా కొంకణ దేశమున కరుదెంచి కడుపార భుజింపుచు సర్వదమనుని వేనోళ్ళ శ్లాఘించుచుండిరి.

ఒకానొక సమయమందొక నిరుపేద యారాజముఖద్వార మునుండి వెడలుచు, అచ్చ టన్నదానమొనర్చుటం గాంచి జనస మూహమున గలశి తానును, ప్రశుష్టిగ భుజించి యానిరుపేద సంతు ష్టాంతరంగుడై రాజును కనుంగొని యా మహాత్మునికడ కరుదెంచి మహారాజా, తమదయవలన నేను కడుపార భుజించితిని, దేవర యొసంగిన భోజనాదుల కేనెంతయు తృప్తిజెందితిని. కాని యింట నాభార్యాపిల్ల లన్నములేక మలమల మాడుచున్నారు. నేనింటి కేగినది తడవుగ వారెల్ల రాకలిబాధకు తాళజాలక నేనేమైనగొని వత్తునను యాశచే నాకొరకై వేచియుందురు.

అట్టి నా భార్యాపుత్రులకడకు నేను రిక్తహస్తుడనై వెడలితినేని వారు నిరాశజెంది యుస్సురుమనెదరు. కష్ట సుఖములు తెలిసిన నాభార్య నెటులైన నోదార్చుకొందునుగాని, అమాయకులగు చంటిబిడ్డల నాగబట్టుట దుర్లభము. గాన నో సర్వదమన మహారాజా, వారికి గూడ నొకపర్యాయము తమ గ్రాసము చెందజేయుడని దీనవదనుడై బ్రతిమాలుకొనెను. నరపాలుడా సిరుపేద మాటలకెంతయు జాలినొంది నొక శేవకుని రావించి వీనికి వలయునంత ప్రసాదమిడి పంపుడని యాజ్ఞనిడ నా శూద్రమాత్రుడు స్వామీ, నేను బహుదూరము ప్రయాణము గావించినగాని యిల్లు చేరను. పక్వము కాబడిన యీప్రసాదమప్పటికి రూపు మారవచ్చును. కావున నాకు నాలుగణాలు రొఖ్ఖమిప్పింతు రేని మాయూర నంగడిగలను, వలయుభోజనసామగ్రింగొని నాజాయా. పుత్రులను తమభోజనముచే తృప్తి గావింతుననియు, వెండియు తమ కీర్తిని మేనప్రాణము లున్నంతవరకు గొని యాడుదునని రాజసత్కార్యముల న్నెక్కు కొనియాడెను. రాజదియు వాస్తవమని గ్రహించి ఆదీనుని కోర్కెచొప్పున నాలుగణాలు రొఖ్ఖమిచ్చి పంపివైచెను.

ఆ నిరుపేదయగు కిరాతుడు, యిల్లుచేరి తన యూరనుండు అంగడివాని దరికేగి, మూడణాలకు మాత్రము భోజనసామాగ్రిని కొని యింటికేగి తనయర్ధాంగికొసంగ ఆమె నాటికెట్టులో బిడ్డలను తృప్తిపరచెను.

అంత నాకిరాతుడు తనచేత మిగిలియుండు నాలుగు రాగి బిళ్ళలకు కొన్ని గాలములను కొని అనుదినము గాలముల సహాయ్యమున చేపలను వేటాడి వానిని పట్టణములో వీధివీధుల తిరిగి విక్రయించి జీవనము చేయుచుండెడివాడు. యిట్లు కొంతకాలము నకు చేపలమ్మిన ధనమునకు మరికొన్ని గాలములను కొని తన యొద్ద కొందరు కూలీలుండు నట్లేర్పరచి వారిచేతన్గూడ చేపలను బట్టించుచు, ఆయూధారముపైన తాను విశేషముగ ద్రవ్యమును సంపాదించి అచ్చటచ్చట పెద్దచేప లంగడులను బెట్టించి, తన నవుకరులచే విక్రయింపజేయుచు తానొక గొప్ప స్థితిపరుడయ్యెను.

విశేషధన మీచేపలు పట్టుటవల్ల సంపాదించినను, తాను మాత్ర మాతని కులవృత్తి విడునక, తనకింత ద్రవ్య మున్నదని గర్వింపక, మునుపటికన్న తన వ్యాపార మభివృద్ధి పరచుచుండెను.

కొంకణదేశమును పాలించు సర్వదమనుడును, తాను రాజ్యాధికారము వహించినదాదిగ, అవసానమువరకు సర్వదా అన్నదానమొనర్చుచు కొంతవడి కేదియో నకశ్మికవ్యాధి సంభవించి నందున భూలోకమును విడచి పోయెను.

తమ విధిప్రకారము యమభటు లాతని జీవమును గొంపోయి, తమ యేలికయగు యమధర్మరాజున కప్పగించిరి. ఆకాలుడును తన మంత్రియగు చిత్రగుప్తుని రావించి, భూలోకమున యీవ్యక్తి జీవించియుండునపు డీతని ఫలితములను జూడుమని ఉత్తరువుజేసెను.

చిత్రగుప్తుడన్ననో, యీకాలపు వర్తకుల వలె నధర్మ లెక్కలను వ్రాయు మనుజుడుకాడు. నిరంతరము ధర్మబుద్ధిచే పాపపుణ్యములను వ్రాయు మంత్రివర్యుండు. సర్వదమనుడును, చిత్రగుప్తుడు తనలెక్కలనుజూచి తన్ను విష్ణులోకమునకు బంపునను యాశచే చిత్రగుప్తుని ప్రత్యుత్తరమున కెదురు చూచుచుండెను.

బుద్ధిశాలియగు నాకాలునిమంత్రి కొంకణదేశాధీశుండగు సర్వదమనుని ఖాతాను తన లెక్కలనుండి వేరుపరచి దానియందు పాపపుణ్యములను గ్రహించి తనుప్రభువునుంగాంచి, ధర్మరాజా! యీతడొనర్చి నంత పాపము, యిదివరకు మనకడ కరుదెంచిన యే జీవియు నొనర్చియుండ లేదనియు, తుచ్ఛుడగు నీరాజు నేమిగావించినను, యీతనిపాపము తీరదని బదులిడెను.

అప్పుడు యమధర్మరాజాగ్రహిడై, దుర్మార్గుడా రాజరాజువయ్యు తినుటకు యితరులకిచ్చుటకు వలయునంత భాగ్య ముండియు, భూలోకమున సత్కార్యములను గావింపక, యింత పాపమును గట్టుకొంటివి. నీముఖముం జూచిన నీవొనర్చిన పాతకము మాకును కొంతరావచ్చునని, యనరానిమాట లాడ సర్వదమనునని దూతలగ్రావించి, ఘోరీ! వీనిని మీయిచ్చవచ్చినట్లు గావింపుడని యాజ్ఞనిడెను.

అంతట సర్వదమన నృపాలుడు, చిత్రగుప్తుని ప్రత్యుత్తరమునకు, కాలునియాజ్ఞ కెంతయు నచ్చెరువంది, చిత్రగుప్తునిం

గాంచి, ఓ మహాత్మా! చిత్రగుప్తుడన సత్య వాక్పరిపాలకుడనియు, న్యాయాన్యాయ విచక్షకుడనియు, జీవులొనర్చు పాపపుణ్యము లను సక్రమముగ లెఖలు వ్రాయు వనియు, భూలోకమున జనులు నిన్ను వేనోళ్ళ గొనియాడుచుందురు. అట్టి మహనీయు డవు నాలెక్కలు వ్రాయుటయం దింతపొరబడుటకు కారణమెద్ది? నాబాల్యావస్తయందు నేనేమి పాపమొనర్చినది యెరుంగజాలను. అట్లు గావించినను, దానిఫలిత మనుభవించుటకు నాతల్లిదండ్రులే గదా శాధ్యులు? నేను బుద్ధెరింగి శింహాసనా సీనుడనైనది మొద లు నేనొనర్చిన యన్నదానము భూలోకమున గాదు మరేలోకమున గాని, మున్నెన్న డేరాజొనర్చియుండ లేదు. వెండియు, ముందట్టి దానమొనర్చువారుకూడ లేరని ఘంటాస్పదముగ నేను చెప్ప గలను. అదియునుంగాక, నేను నిత్యసత్య వ్రతుడను, భూతదయా ళుడను, ఏకపత్నీ వ్రతుడను, అట్టివాడను నేనెట్టుల పాపాత్ముడ నగుదును? బహుకాలమునుండి లెక్కలువ్రాయుటచే పెద్దతనమున బుద్ధిచలించి నాలెక్కలు మరియొక వ్యక్తిపేరుతో వ్రాసియున్నా రేమో చూడుడని, యాసర్వదమనుడు తానొనర్చిన సత్కార్యము లన్నియు నాచిత్రగుప్తునకు జెప్పుకొనెను.

కాలు డాతనిమాటలు పరికించి ప్రధానోత్తమా! యీత డిట్లు జెప్పుచున్నాడేమి? వీని దృఢసంకల్పమును బట్టిచూడ నాకు ను సంశయముగల్గుచున్నది. లెక్కలేమైన పొరబడినవా? యని ప్రశ్నింప చిత్రగుప్తుడా సర్వదమనునివంక తేరిపారజూచి, భూలో

కమున నీవన్న దానమొనర్చుతరి నొక కిరాతునకు నాలుగణాలు రొఖ్ఖమిచ్చి యుండలేదా? యనియడిగెను. అవ్వు నాకిరాతుడగు శూద్రమాత్రుడు బహుదూర ప్రయాణము గావించిన గాని, యిల్లుచేరవనియు, తనకు కొంత పైకమిచ్చిన తనయూర భోజన సామాగ్రినిగొని, తనభార్యాపిల్లలను తృప్తిపరచెద ననియు, బ్రతి మాలినందున వల్లెయని నాలుగణాలు దాన మొసంగిన మాట సత్యమేనని బదులిడెను.

అటులైన నోసర్వదమనా, ఆకిరాతుడు నీవొసంగిన నాలు గణాలలో మూడణాలకు మాత్రము భోజనసామాగ్రికి వెచ్చించి మిగిలిన యణా చేపలను పట్టుటకు కొన్ని గాలములను కొని, ఆగాలఫలితమువల్ల మరికొన్ని గాలములను సంపాదించి కోట్లకొలది జలచరములను జంపి తన నవుకరులచే జంపించి, చేపల బేరమున వేలుగణించి, అచ్చటచ్చట చేప లంగడులను బెట్టించి పెద్ద చేపల వ్యాపారస్థుడై నాటినుండి నేటివరకును కోట్లకొలది జీవ రాసులను జంపుచున్నాడు. మరియు తన నవుకరులచే జంపించు చున్నాడు. నీవాతనికా ద్రవ్యసహాయ మొనర్పకున్న ఆతడట్లు గావించి యుండడుగదా? కావున నోసర్వదమన భూపాలా! ఆత డొనర్చిన పాపము నీ వనుభవింప వలసినదే. ముందు పాప ఫలిత మనుభవింపుము. ఆపైన విచారింతమని, పాపమా సర్వదమనుని మారాడనివ్వక భటులచే పాపలోకమునకు గొంపోవ చిత్రగుప్తు డాజ్ఞ జేసెను.

అటు పిమ్మట భూలోకమున నాకిరాతుడు పదునైదు వత్స రములు జీవించి మృతుడయ్యెను. ఆ పదునైదు వత్సరములు పాప మే పాప మెరుగని యీ సర్వదమునకు ధనదాన మొనర్చిన దోషమున యమలోకమున పడరాని పాట్లు పడెను. కిరాతుడు యమలోకము చేరగనే, చిత్రగుప్తుడు సర్వదమునిని కఠిన శిక్ష నాకిరాతున కప్పగించి కొంకణ దేశాధీశుండగు సర్వదమునిని పుణ్యాలోకమున కంపెను.

కిశోర నృపాలా! చూచితివా ధన దానఫలితము. గాన నీతసి కెంత మాత్రము ధన దాన మొసంగ వలదని చంద్రవదను డనెను.

చంద్రవదనుని పల్కు లాలించి కిశోరుడు మిన్నకుండుట గాంచి యీ పండరి వాసుడు తోక ద్రొక్కిన త్రాచువలె మండి పడి, నిజానిజమును గనుంగొనక చేపలు పట్టు కిరాతునకు నన్ను సరిపోల్చితివా? మహారాజ పాత్తును పత్తుగ దినుచున్న నీకింత కండ కావరమా? వాస్తవమూరయ జాలక నీయిచ్ఛ వచ్చినట్లు ప్రేలి భగవత్కార్యమునకు ధనదాన మొసంగ వలదని రాజునకు దుర్బోధల నొనర్చిన నీకంట రాని వ్యాధి సంభవించును గాక. మెండియు నో కిశోరరాజా! దాన మొసంగుట కుద్యుక్తుడవయ్యు మంత్రి పలుకు లాలించి యాచకున కాశబెట్టి రిక్తుని గావించితివి గాన నీవు రాజ్యభ్రష్టుడ వౌదువుగాక? మీకీఫలితములు రాబోవు పండరి పురముననే నొసబోవు పొందుర గ సహాసము పూ ర్తి

యైన మండలము దినములకు సంభవించును గాక, యని శపించి కండ్ల నగ్ని కణము లూడిపడున ట్లాగ్రహించి రాజకచ్చేరి తక్షణము విడచి పోవ నుద్యుక్తుడై యుండ కిశోర శింహ చంద్రవదను లాత డొక భక్తుడని యెరింగి వారి శాపవచనముల కెంతయు భీతిజెంది ఆఋషుని పాదములపై బడి స్వామీ! రాచకార్యములను లోకవ్యవ హారములను చెక్కగ తెలియక బాల్య చాపల్యమున బల్కిన మాపల్కుల కల్క జెందక మమ్ము కరుణించి వలయు ధనమును గొని, మమ్ము శాప విముక్తులం జేయుమని ఆ ముదుసలి కొన కాళ్ళంటి ప్రార్థింప జొచ్చిరి.

అంతట నా ఋషి శేఖరుండు శాంతించి రాజ మంత్రు లిర్వురు, నూతన సింహాసనా సీనులనియు, బాల్యచాపల్యమనియు గ్రహించి, కిశోర చంద్రవదను లారా! వ్యూరడిల్లుడు. పలికిన పాలకు వగచిన ప్రయోజనము సున్న. మీరొసంగు ధన దానము నాగత్యము లేదు. నేనొసర్పబోవు నలుబది రెండవ పాండురంగ సప్తాహమున కొక రెండుమాసములు వ్యవధి గలదు. కన్నుల పండువుగ మీరా మహోత్సవమును తిలకించి నిజానిజేములను గ్రహించితి రేని మీకు శాపవిముక్తి కాగలదని బల్కి తాను వెడలి పోయెను.

కిశోరుడు తాను పుణ్యక్షేత్రమగు పండరిపురమును దిల కించుటకుకుతూహలుడైనను,తనపరిపాలనమును వదలిపోవుటకును, తనయర్ధాంగి నింటనొంటిగ వదలి వెళ్ళుట కొండొక వడి విచా

రించి యట్టకేలకు తనప్రయాణమును త్వరలో జరిగించ వలయు న నియు, ఆలశించిన సప్తాహము నాటికి పండరి చేరకపోయిన పోవ చ్చుననియు నెరింగి, చంద్రవదనుని గాంచి, మంత్రిపుంగవా! మన మిక నాలశించిన ప్రయోజన మావంతయు లేదు. ప్రయాణమతి రయమున గావించ వలయును. మనము తిరుగవచ్చు వరకు మన క్షిష్టుడును, బంధువుడు నగు నుదారశింహుని, రాచకార్యము లను జక్కబెట్టుటకు నియమించు టుచిత మని గ్రహించి యట్లు గావించి తానును మంత్రియు, వలయు నంత ధనముఁగొని, వడి గల యశ్వముల నారోహించి వాయు వేగమున ప్రయాణము సాగించిరి.

ఇట్లు ప్రయాణమును, సాగించిన నారాజమంత్రు లిరు వురు సాయం సమయమున నొక యరణ్య మార్గము చేరిరి. అచ్చట నొక బాటసారినిం గాంచి సోదరా! యీ ప్రాంతమున నేదేని గ్రామము సమీపము నందున్నదా?యని యడుగ స్వామీ, మీరు కొన్ని ఘుంటలీ యశ్వములను వాయువేగమున నడిపించినను పూరు గాని పట్టణము గాని గాంచజాలరని నుడివెను. వెండియు నాకాపు యీ వటవృక్షము చ్ఛాయ నేటికి విశ్రమించి మరునాటి యుదయ మున మీదారినిబొండనియు, యిచ్చటభయంకరమృగములెవ్వియు చేరవనియుబల్క, వల్లెయని వారిర్వురునావటవృక్షము ఛాయతమ తమ యశ్వములను డిగ్గి ఆనాటికి సరిపడు తమ యొద్ద నుండిన తిను భండారముతో తృప్తిపడి తమయశ్వములనుం గూడనట్లు గావించి,

భీకరమగు నాయరణ్య మధ్యమున వృక్షమృగముల యార్భాటపు కూకల కించు కేనియు భీతిల్లక కొంతవడి నొక చోట కూర్చుండిరి.

ఇంతలో లోక బాంధవుడు పశ్చిమ సముద్రమునందు మాటువడెను. యెప్పుడు భాను డస్తాద్రి చేరునాయని అతురత పడుచున్న చీకటియను రాక్షసరాజు నలుదెసల క్రమ్ముకొని గాఢాంధ కారమును గావించెను.

పాపమీ రాజ మంత్రు లిరువురును యచ్చోటనే తాము మార్గ మధ్యంబున గాంచిన వన్నియు నొకరి కొకరు చెప్పుకొనుచు అర్ధ రాత్రము వరకు గడిపిరి.

బహు దూర ప్రయాణము గావించి నందున వా రలసి యుండుటంజేసి నిద్రాదేవి వారిరువుర నొక్క పర్యాయమే మోహించినందున క్రింద భూమి పైపరుండుట కిష్టము లేక, యే దేనియున్నత స్థలముండిన బాగుండు నని యచ్చటి కనతి దూరము ననే అట్టి ప్రదేశమును గాన్పింప నాయెత్తైన ప్రదేశమున పరుండిరి.

కొండ ప్రదేశములనుండి చల్లనిగాలి తమకుసోకుచుండుటచే అంతకు ముందే తమ్ము వరించిన నిద్రా దేవి పూర్ణముగ వారిలో నైక్యమయ్యెను.

దీర్ఘ కాయము గల రెండు పక్షులు ప్రతిదిన ముదయము ననే పొదలకడ లేచి అందులో వెంటి దక్షిణపు దిక్కునకును, పోతు ఉత్తరదిక్కునకు నరుదెంచి తమతమ యాహారములచే పొట్ట నింపుకొని సాయం సమయమున కా యడవి మధ్యమున జేరి

ఆ పక్షిరాజములు జంటగ సుఖ నిద్రను జెందుచు బహు దినముల నుండి కాలము గడుపు చుండెను.

అవెట్టి పక్షులోగాని. వాటి దీర్ఘ కాయములను గాంచి ఆ కొండ ప్రదేశముల నుండు సింహ వ్యాఘ్రములు సహితము చెల్లా చదరై పారును. అందు వలననే అచ్చోట సాధు మృగములను ప్రయాణము చేయు వ్యక్తులును, సహిత మీా పక్షిరాజములు పరుండు ప్రదేశమును గని, వాటికి సమీాపమున పరుండి నిర్భీతి జెందు చుందురు. అయిన నాపక్షులు యీా దుష్ట మృగములను గాంచి భీతిల్లక పోలేను. కాని నవియే జడిశి పారిపోవుట గాంచి ఆపక్షులు బెట్టు చెడక వర్తింపుచుజేడియుచునే యుండుటలవాటు. కాని బహుకాలము జరిగి నందున అలవాటు పడి సర్వము దైవ యత్నమని గాబోలు నవియు నిర్భయ నిద్రనే వహించు చుండెను.

కిశోరశింహా, చంద్రవదనులు తాము నిద్రించుట కేదేని యున్నత ప్రదేశ ముండిన బాగుండుననీ, పగలంతయు తమతమ యాహార్ధము తిరిగి తిరిగి సుడివడి మై మరచి జంటగ నిద్రించు చున్న యాపక్షిరాజములపై కెక్కి మంత్రి పుంగవు డగు నా చంద్రవదనుడు మొగ పక్షిపైననూ, రాజచంద్రుండగు నా కిశోరుడుఆడుపక్షిపైననూ,పరుండివిశాల దేహములుగల నా పక్షులపై మృదువుగ నుండుటచే హాయిగ నిద్రించిరి. పాప మా వ్యక్తులివి పక్షులని తలంచరైరి. వెండియు తా మెన్నడింత దీర్ఘ కాయము గల పక్షులనూ చూచియు నెరుంగరు. అయిన నాపక్షు లేజాతిజీవి

కిని, హానిజేయునవికావు. అవితిను నాహార మదెట్టిదో కాని యీ యరణ్యమందుండు యేపదార్థమును అవిముట్టవు.

యిట్టితెరి గుఱ్ఱములు మాత్ర మప్పుడప్పుడు తాముండునది నూతన ప్రదేశమైనందున దిగ్భ్రమజెంది చూచుచు, కొండప్రదేశములనుండి యీ పక్షులుండుచోటున కరుదెంచుటకు వెరచిన దుష్టమృగములు భీకరముగ నడచునప్పుడెల్ల నులికిపడుచు నాటి రాత్రెట్టులో గడపెను.

మార్గాయాసముచే సుకుమారులైన నా రాచబిడ్డ మంత్రి సహితముగ హాయిగా మైమరచి నిద్రించుటచే మెలకువ రాకుండెను.

ఆ పక్షులు రెండునూ, దివాకరుండీ లోకమునకు రాక పూర్వమే మేల్కాంచి, తమపై నేదియో మృగము కూర్చుండె ననియు, తమ్ము చంపివైచుననియు, త్వరలో వేవేగ చనివమీదట నేమైనను గానిమ్మని నట్లుగావించ వలెనని రివ్వుమని ఆకాశమార్గమున ప్రతిదినము తామేగు మార్గమును బట్టి, పోతు ఉత్తరపు దిక్కునకును, పెంటి దక్షిణపు దిక్కునకును పరువజొచ్చెను.

అంత మణికంధరుడాశ్చర్యచిత్తుడై స్వామీ! అంతటిమానవులను తమతమ మూపులపై నుంచుకొని ఆకాశ మార్గమున నెగురగలవా? ఆపక్షులంత బలము గలవని నమ్ముటకు నాకు సందేహము కల్గుచున్నది. అనిపల్క, నా విప్రవర్యుండు పక్కన నవ్వి, బాలకా అంతటి పుష్టిలేనిదే సింహ, శార్దూలములు భయపడునను కొంటివా? నిస్సందేహముగ నాపక్షిరాజము లంతటి

బలము కలిగియే యుండ వచ్చును. వాటి సంతతి నేటికిని భూలో
కమున గలదు. వకచో మనము కూడా మార్గ మధ్యంబున
గాంచిన గాంచవచ్చునని పలికెను.

అంతట మణికంధరుడు, పక్షివాహనులై గగన మార్గం
బున నెగురుచున్న సుగుణ ఘట్టాధీశుండును, తన మంత్రియు
నేమయ్యెనో విన నాతురత కలవాడై తరువాత యేమి జరిగినదని
విజయవర్మ పాదము లొత్తుచు నడుగ నాపాయుడిట్లు చెప్ప
దొడంగె.

బాలకా యేమిచెప్పుమును, ఆపక్షుల యొక్క రెక్కల
వాయు వేగమునకు పురుష పక్షి నెక్కిన చంద్రవదనుడును,
స్త్రీ పక్షి నారోహించిన కిశోరశింహుడును, మేల్కాంచి తమకు
జరిగిన యడబాటునకు వగచుచు, మిన్నంటి పోవు చున్నందున
క్రింద దుమికినచో పర్వతములపై బడి చత్తుమని భీతిలి దైవమెట్లు
గావించ నున్నాడోయని నిశ్చేష్టులై ఆయా పక్షుల యొక్క గొంతు
కలను పట్టుకొని కదల మెదలక గరుత్మంతు నెత్తిన మహా విష్ణువు
వలె ప్రయాణమును సాగించు చుండిరి.

అంతట దక్షిణపు దిక్కునకు పోయిన నా యాడు పక్షి
భీతి జెందిన దై కొన్ని వందలామడలు గడచి నియమిత ప్రదేశ
మునకు చేరక పూర్వమే భూమిపై వ్రాలెను. దాని నారోహిం
చిన కిశోరశింహుడు బ్రతుకు జీవుడా యని ఆ పక్షిపై నుండి క్రిందికి
దుమికి తన కేదేని ఆ పక్షి హానిజేయునను భయముతో పడిపడి
పరువజొచ్చెను.

తన పైనుండి దుమికి పరుగిడుచున్న యారాచపట్టిని గాంచి భీతిజెందుచున్న నాపక్షి తనప్రాణము దక్కినదని సంతసించుచు ఆకాశమార్గమునుబట్టి మునుపటివలెనే ఆహారార్థము తననియమిత ప్రదేశ మలంకరించెను.

పాపమీ కిశోరు నీయరణ్యమధ్యమున వదలినను, రాచబిడ్డ డైనందున జడియక ఆప్రాంతముననే ద్రిమ్మరుచు, అడవిపండ్లును, కాయలనుదినుచూ, రెండుమూడురోజులు గడపెను, వెండియు మాటిమాటి కాతడు మంత్రినిదలంచి దుఃఖించుచు, నాతనిగతి యెట్లయ్యెనోనని విచారపడుచు, నలుని వదలిన దమయంతి వలె తహతహలాడుచు, పిచ్చిపట్టినవానివలె తిరుగుచు, తనకు మృగములేవియు నాయరణ్యమున గోచరింపకున్నను, అడుగుల జాడలనుబట్టి ఆప్రాంతమున ద్రిమ్మరు మృగములను గుర్తించుచు, యెట్టులో నా త్రినాళ్లు గడపెను.

నాల్గవనాటి యుదయ మారాచపట్టి యీ నిర్మానుష్య ప్రదేశమున నేనొంటిగ నుండిన నేమిప్రయోజనమని, తోవగాన్పింపకున్నను, వక దిశ ననుసరించి వెళ్ళిన కొన్నిరోజులకైన నేదేని యూరు గాన్పింపకపోదని తలంచి అట్లు గావించుచు, మృగములేవేని తన్ను చంపునని భీతిల్లుచు, అయిన నామార్గమున దుష్ట మృగముల అడుగులజాడ లేమియు కన్పట్టనందున ధైర్యమును దెచ్చుకొనుచు, చిగిర్చియున్న లేతచెట్లను, నవనవలాడు పత్రములను జూచి ఆనందించుచు, వాని చల్లని పిల్లవాయువుల కెంతయు

హాయి జెందుచు, అప్పుడప్పుడు తుల్లిపడి తన యర్ధాంగిని, రాజ్యమును, గగనమార్గమున పక్షి నారోహించి నెగిరిపోయిన మంత్రిని తలంచి చింతించుచు నడచుచుండెను.

ఇది యిటులుండ నా యరణ్య మధ్యంబున కొందరు వర్తకులు తమ లొట్టియపై కొన్ని సరకులనుంచుకొని వకచోటినుండి మరియొకచోటికి బోవుచు, మార్గమధ్యంబున యీ యరణ్య మందుండొక తటాకము దరినుండు చెట్లనీడలయందు విడసి సరుకులను మూపుపై నుంచియే యామొంటె నొకచో కట్టివైచి తమతో నుండు రొట్టెలు మొదలగు పదార్థముల నారగించి దైవికముగ నూతన జలపూరితమగు నాతటాక జలములను కడుపార గోలి మత్తుగ నా చెట్ల నీడలయందు గుఱ్ఱపెట్టి నిద్రించిరి.

అంతట నాలొట్టియ పిపాసబాధచే గాబోలు, తన్ను బంధించిన త్రాళ్ళను త్రెంచుకొని తటాకజలమును త్రాగి కాలికి బుద్ధి చెప్పి కొన్ని యామడలు దాటిపోయెను.

పాపము నిద్రించుచుండిన వర్తకుల కీవింత లేశమాత్ర మైనను తెలియదుగదా !

కొంతకాలమునకు వారిలో నొక వణుజుడు మేల్కాంచి తమ ఒంటె లేకుండుటగాంచి, యెదపై మోదు కొనుచు, వో యన్నలారా ! లెండు, లెండు, మీానిద్ర లిక చాలింపుడు, కొంప మునిగినదని నొక్కిపెట్టున కేకవైచెను.

సుఖముగ నిద్రించుచున్న నావణుజసోదరు లులికిపడి లేచి

యేమి మూడినదన నెవ్వరో మన యొంటె నపహరించిరని చెప్పినది తడవుగ వారంద రొక్కమాటు బోరున దుఃఖించిరి.

అంతట నాకనిష్టుడు, అన్నలారా! యెంతయేడ్చిన నేమి ప్రయోజనము? నలువురు నాల్గువైపుల కలయ వెతకినగాని దాని జాడ తెలియదని పల్క వైశ్యకులమున జనించినందున పిరికితనము వారినట్లు గావింపనందున నలుగు రేకీభవించి నా యొంటెను వెతక నారంభించిరి.

పాపమీ కిశోరుడుమాత్ర మెండకన్నెరుగని వాడయ్యు విధివశంబున యరణ్యయందలో బురపై నొకపోత నురచుకొని నడచుచు నేయుండెను. యిట్లు కొంతదూరము నడచినపిమ్మట నా వర్తకులు తమ లొట్టియను వెతకుచు కిశోరున కెదురైరి. నిర్మా నుష్యమగు నీ ఘోరారణ్యమున వారిని గాంచినంతనే మితిమీరిన సంతోషము గలవాడయ్యె కిశోరుడు, అన్నలారా! మీదే యూరు, యెచ్చటి కేగుచుంటిరి? ఇచ్చట సమీపమున నేదేని యూరుకలదా? యని ప్రశ్నింప దానికేమిగాని స్వామీ! మా లొట్టెయొకటి పారిపోయినది. మీకేమైన తెలియునా? యని యడి గినది తడవుగ దాని వెనుకభాగపు ఎడమకాలు కుంటికదా? యనెను. అవు నదియేనని నందరొక్కపరి దిక్కులు పిక్కటిల్లు నట్లు పల్కిరి. దానిమూపుపై నొకవైపున బెల్లమును, మరియొక వైపున గోధుమ లుండియుండలేదా? యని తిరుగ ప్రశ్నింప వా రానందాశ్చర్యచిత్తులై ఆ! ఆ!! అని తలలూపిరి. దాని కుడికన్ను

గుర్తింకదా? యని కిశోరుడు మరలప్రశ్నింప స్వామీ! అదియే మాయొంటె యనిరి.

అంతట కిశోరు డాతురత పడుచున్న వారికి ప్రత్యుత్తర మివ్వక దాని ముందుపండ్లు రెం డూడియుండ లేదా? యని ప్రశ్నించెను. స్వామీ! అవును తమరు చెప్పిన లక్షణములన్నియు మా యొంటెయందున్నవి. దానిని తమ రెచ్చోట గాంచితిరి. దయచేసి తాముగూడా వెంటవచ్చినయడల తమ లొట్టి పిట్టను గాంచెద మనియు, దాని మూపుపైనుండు వానిలో కొంత బెల్లమును, తేనె యు తమకుకూడా రొట్టెలయందు కలిపి యాహారముగ నొసంగెద మని బ్రతిమాల జొచ్చిరి.

అంతట నాచక్రవర్తి, వర్తకులారా మీయొంటెను నేను చూడలేదనిచెప్పి వారి నుస్సురు మనిపించెను.

అప్పుడు వర్తకులు తమలోతా మేదియో గుసగుసలాడి యా ఒంటెను తామే అపహరించినట్లు అనుమాన పడితిమని చెప్పిరి. అయ్యా, నేనట్లు గావించువాడను కానని బ్రతిమాలు కొన్నను, వారి కేమాత్రము దాక్షిణ్యములేక కిశోరరాజును బంధించి తమగ్రామమునకు గొనిపోయి తమయేలిక కీ వృత్తాంతమంతయు చెప్పినది తడవుగ నాభూనాథుని చరసాలయం దుంచునట్లు తమభటుల కాజ్ఞాపింప క్షణమాత్రమున వారట్లు గావించిరి.

తన స్థితిగతులు చెప్పుకొనిన నెట్లుండునో కాని కిశోరుడు మాత్ర మట్లు గావించనందున సామాన్య వ్యక్తికి విధించు శిక్షనా

తనికిని విధింపబడియె. యివ్విధంబున కిశోరు డిచ్చోట బంధి తుడయ్యె.

మణికంధరా! యికను చంద్రవదనుని అవస్థ యెట్లున్న దో చెప్పెద నాలకింపుమని, యివ్విధంబున నాభూసురుండు చెప్పఁ దొడంగెను.

ఉత్తరముఖముగ నేగిన యా మొగపక్షి ఆకసము మారు మోగునట్లరచుచు, రివ్వుమని కొన్నిఘంటలు ప్రయాణము గా వించెను. పురుషజన్మయినందున గాబోలు యించుకేనియు నా పక్షి జడియక, కానున్నది కాకమానదని తలంచి, నియమిత ప్రదే శము చేరవలెననియు, అచ్చట తనతోడిపక్షులు సహాయపడిన తనపైనున్న దుష్టమృగము తన్నేమియు చేయజాలదని రెక్క బల మును జూపుచుండెను.

పాపము చంద్రవదనున కేమియు తోచుటలేదు. యీజరి గినదంతయు కలలోనివార్తవలె వానికగుపడుచు దిగ్భ్రమజెంది వెర్రిచూపులు చూచుచు పొరలివచ్చు దుఃఖమును మ్రింగివైచు కొనుచు,తనఅవస్థ యెట్లయిన నంతబాధలేదు.కాని, తనవలన బాధ పడి రాజ్యసహితముగ నర్థాంగినివదలి అష్టకష్టము నొందుచున్న కిశోరుని గతి యెట్లులుండెనో కదా? భీతిజెంది క్రిందకు దుమికి ప్రా ణములను గోల్పోయి యుండడుగదా? నామిత్రుడగు కిశోరుడిప్పు డు సజీవుడై యున్నాడా?యని అతనినిదలంచి కంటినుండి కన్నీరు కాల్వలుగట్ట నేడ్చుచుండెను.

యిట్లా పక్షి తన నియమిత ప్రదేశము సమీపించి నందున మెలమెల్లగ భూమిపైవ్రాల నాకసమునుండి దిగుచున్నట్లు మంత్రిగ్రహించి తా నప్రమత్తుడై పక్షిబారినుండి తప్పించుకొనవలె ననియు, లేనిచో తనప్రాణములు దక్కనివ్వ దనియు, తలంచి నయ్యది భూమిపై వ్రాలినది తడవుగ, దానిబారినుండి తప్పించుకొనుటకు భూమిపై దుమికి తాను పరుగిడ నుద్యుక్తుడై యుండియు, తన్నుగాంచియే ఆపక్షి తిరుగ నాకసమున కెగిరినందున తానట్లు గావింపడయ్యె, కాని ఆతురతచే తన యుత్తరీయ మా పక్షిపైననే వదలి వైచెను.

ఆ పక్షిరా జమట్లాకాశమున యిటునటు తిరుగుచుండగా రెక్క లల్లాడుటచే నావస్త్రము దానిరెక్కలలో చిక్కుపడినట్లు చంద్రవదనుడు గ్రహించెను.

వస్త్రము పోయినందు కాతడు చింతించలేదు. కాని అట్లు జరుగుటవలన ముందు తనకింకను కష్టములున్నట్లు గ్రహించి, కాని మ్మువిధిని తప్పించుట కెవ్వరికి తరమని ధైర్యమును దెచ్చుకొని తానిప్పుడుండున దేప్రదేశమాయని తెలిసికొనుటకు ప్రయత్నించెనుకాని, అట్టి ప్రయత్నము నిష్ఫలమయ్యెను.

తానుండు ప్రదేశము మాత్రము మూడువైపుల యెత్తయిన పర్వతములుండెను. వకవైపున విశాలమగు బయలు కనబడెను. అందుల కాతడు సంతసించి తన చొక్కాజేబులో నుండు ఫలహారమును కొంత బయలుపరచి క్షుద్బాధ తీర్చుకొని కొంత

వడి నచ్చోట విశ్రమించెను. యిట్లాతడు కొన్నినిమిషములు మాత్రము నిద్రించి కిశోరునిసంగతి జ్ఞప్తికివచ్చి తటాలున లేచి కూర్చొని విచారముగ నలువైపుల పరికించిచూడ, తానేగుటకు మార్గములేక నాల్గువైపుల కూడా పర్వతపంక్తి కాన్పించెను. అందుల కాతడు భీతిచెందినవాడై యిదియేదో రాక్షసమాయయని తలంచి దైవముపై భారమువైచి నలుదిక్కులఁ గాంచుచుండెను.

ఇవ్విధంబున నాతడు కాలముగడపుచు కిశోరు డేమయ్యెనో కదా! యప్పటికైన తన రాజ్యము చేరగలిగితినేని యాతని యర్థాంగి నానాధుడేడనిన నేనేమని బదులుచెప్పుదును? ఆతడు లేక నేనాతనిరాజ్యము చేరుటెట్లు? పిడుగువలె నా పండరివాసుని శాపగడవు సమీపించుచున్నదే, నేనెట్లు మారాజును గాంచగలను? పండరి చేరగలనా? అని పరిపరివిధముల తలపోయుచుండ పశ్చిమదిశయందు కాన్పించు పర్వతపంక్తది యేమియోకాని కదల నారంభించెను.

దాని కాతడెంతయు భయభ్రాంతుడై దిగ్భ్రమజెంది ఆశ్చర్యముగ జూచుచుండగనే యాపర్వతము ఉత్తరపు వైపునుండు పర్వతము పైనెక్కెను. అందువలన పడమరవైపు బయలుగ నున్నట్లాతడు గ్రహించెను కాని, యీమాయను కనుగొన జాలడయ్యె. మరికొంతదూరము నేగుసరి కొకగోడ షుమారు పదియడుగుల నెత్తుగ నాతని దారి కకస్మికముగ నడ్డుపడియె. దాని కాతడెంతయు జడిసి వెడదారింబట్టి పోవుచుండ వకమారుగ నామిట్టమధ్యా

న్న సమయమున చీకటులు గ్రమ్మి నట్లగుపడి తిరుగ క్షణమాత్రము ననే యెండ తీక్షణముగ జూపట్టెను.

ఇక మనకథానాయకుడగు చంద్రవదనునకు ముచ్చెమ్మ టలు గ్రమ్మ గడగడ వడకుచు నిశ్చేష్టుడైయుండ చెవులు చిల్లులు బోవునట్లొక కేక దిక్కులు మారుమోగునట్లు వినంబడియె.

యిదియంతయు స్వయముగ గాంచుచు తానింక రాజ్యము పైనను, కిశోరునిపైనను, తన యర్ధాంగిపైన నాశ సంపూర్ణముగ వదలుకొనెను.

తిరుగ నావ్యక్తి వెనుకటి పర్వతములవైపు గాంచగ నిర్మ లమైన నొక పెద్ద బయలునందు పచ్చని పైరా ప్రాంతమంతయు గన్పట్టెను.

వేరొకవైపు చూడగా నొక పర్వతము వడివడి పరుగెత్తు చుండెను. యిక నాచంద్రవదనుడు చేయునదేమియు లేక దైవము పై భారమువైచి ఆకసమువంకజూచి స్వామీ! నన్ను రక్షించు భారము సర్వము నీయదియే యనుచుండగనే తిరుగ చీకటులు గ్రమ్మి తనపై నేదియో పడుచున్నట్లగుపడెను. అట్లాతడు పిచ్చి పట్టినవానివలె నొకదారి, తెన్ను, లేక, యిష్టమువచ్చినట్లు పరుగె త్తసాగెను. యిట్లు కొంతదూరము పరువిడ నచ్చటచ్చట యేను గులంత కుక్కలు కాన్పించెను. వీని పరుగుగాంచి నాకునకములు వెంబడించి నంతమాత్రముననే వడివడి నొకజొన్న చేనిలో మనకథ కుడగు చంద్రవదనుడు దూరెను.

ఫలితమునకువచ్చినయాపైరును నాడే కోతమొదలిడినందు నట్లు గావించుచున్న కొందరి నాచంద్రవదనుడు గాంచెను. ఆవ్య క్తులును, షుమారు యాబదిగజముల పొడవును, పదిహేను గజ ముల ఛాతికి తక్కువలేకుండ నాతనికి గోచరించిరి.

ఇప్పటి కీతనికి సగముప్రాణము వచ్చినదని వేరుగ చెప్ప నక్కరలేకయే మనము గ్రహించవచ్చును గదా! కోతచేనిలో నుండి బయటకివెడలుట కీతని నేదేని మ్రింగివైచునని భయము. అట్లు బయల్వెడలకున్న యీభూస్వామి మరియు నాతని సేవకుల చే నేమిముప్పు వాటిల్లునోయని చింతించుచు యట్టకేలకాపొలము నందే దాగుకొనియెను.

ఆభూస్వామియు తానొక ఆయుధమును చేనంది పైరును కోయుచుండ నది పైరులో దాగుకొనియుండు చంద్రవదనుని తాకి గాయపరచినది తడవుగ నాతడు కెవ్వుమని అరచెను. దానికాయ జమాని తత్తరపడి నలుదెసల పరికింపగ మన చంద్రవదనుడు కంట బడియెను.

అంత నాతడు వానిని రెండుప్రేళ్ళతో పైకెత్తి తేరిపారజూచి యిదియేదో వింతజంతువు వలె కాన్పట్టుచున్నదని యిట్టి పులు గును తాను మున్నెన్నడును జూచియుండనందున యాశ్చర్యచిత్తు డై పరికించి చూడగా నదియొక మనిషి పోలికను పోలియున్నదని గ్రహించి తోడి పనివారలకు యిప్పుడేచూపిన తనపని భంగమగు నని యెంచి యిరువదియెనిమిది వత్సరములు వయస్సుగల బలమగు

నావ్యక్తిని అనగా చంద్రవదనుని తన చొక్కాజేబు నందుంచు కొనెను.

వలలోబడ్డ చేపవలె నాచంద్రవదను డీ యజమాని చొక్కాజేబులో గిజగిజ తన్నుకొనుచుండెను.

యిట్లు కొన్నిఘంటలు గడచినపిమ్మట పొలములోని పని యంతయు పూర్తియయ్యెను.

అంతట నాయజమాని, యిలాటి వింతమృగమును మీరెన్నడైనను చూచితిరా! యని తన చొక్కాజేబులో నుండి చంద్రవదనుని వేరు రచి తనచేతినుండి పలువురకు చూపించి తిరుగ వెంటనే జేబునందుంచుకొని నవ్వుకొనుచుండెను. దానికి వారంద రాశ్చర్యచిత్తులై తమకు చూపుడని బ్రతిమాల జొచ్చిరి.

అప్పుడా కాపు తనజేబునుండి మరల నా వింతమృగమును బయటికితీసి క్రిందపడవైచిన చచ్చిపోవునని నేలవరకువంగి క్రింద నిలువబెట్టెను. అంతట వారంద రాశ్చర్యముగ గుంపులుగుంపులుగాచేరి వకడినొకరు తోసికొనుచు ప్రస్తుతము వింతమృగమనబడు సుగుణఘట్టపు మంత్రిని చూచుచుండిరి.

కేవలము వృద్ధురాలగు నొకస్త్రీ తనకు కండ్లు కనుపించుట లేదనియు, జనసమూహములో తోసికొని పోజాలననియు, ఆ వింతపులుగును చూడ కుతూహలముగ నున్నదనియు నొకపడుచు వానిని వేడుకొనగా నాతడా ముసలిదానిని కరంబట్టుకొని మెలమెల్లగ నడిపించుకొనిపోయి చంద్రవదనుని సమీపము నందుంచగా

నా యవ్వ ముక్కుపై వేర్లిడుకొని యిది మనుష్యాకారమును బోలియున్నదని తనచేతనున్న కర్రతో కూర్చొనియున్న నాచం ద్రవదనుని నీటునటు పొరల్చిచూచెను.

వెంటనే యాపొలము కాపు తిరుగ నావింతపులుగును తన జేబునందురచుకొని తనయింటికి గొంపోయి తనయర్ధాంగికి చూపించెను. ఆమెయు నిండా సంతసించి తనబిడ్డ కాడుకొనుట కొసగ వచ్చునని దానినడుముకొక చిన్నగొలుసుకట్టి యింటి మొఖరము నకు కట్టివైచెను. మేడియు నామె వక చిన్నపళ్లెరమునందు కొంతా హారముంచి చంద్రవదనునిముందుంచగా స్వదేశాహారముగ నుండ కపోయినను తినుటకురుచ్యముగ నుండినందు నాతడుదానినితృప్తిగ తినివైచెను. కాని నీళ్లుత్రాగుటకా యజమానిభార్య తెచ్చియిచ్చిన పాత్రము నెత్త జాలకుండుటా యజమాని కనిపెట్టి తనబిడ్డత్రావు లోటాతో నీళ్ళు తెప్పించి పెట్టించగ అదియు నాత డెత్తజాలక బలవంతముగ నెత్తి వలయునన్ని నీళ్ళుత్రాగెను.

నాటికా చంద్రవదను నా మొఖరమునకే కట్టివైచిరి. జనులు తండోపతండంబులుగ నాపులుగును చూడవచ్చిరి. కాని నాయింటిది ద్వారమును బంధించెను. తలవాకిట ప్రజలు గుమి కూడి తలకొకవిధముగ చెప్పుకొనుచుండిరి.

కాపువాడు యిప్పుడా పులుగును చూడవలనుపడదనియు రేపటి యుదయమున చూడవచ్చునని నచ్చజెప్పి జన సమూహ మును తగ్గించెను. కాని కొంతెపిల్ల లారుబైట చెట్లపైనెక్కి చూచుచు కాన్పించనందు నాకాపును దూరుచు వెళ్ళిపోవుచుండిరి.

పశిబిడ్డయగు నా కాపు కూతురీ వింతపులుగును తనతల్లి చూపించగనే దానితో నాడుకొను చుండుటచే నాపె తన దినకృత్యములు రోజుటికన్న పెందలకడ గావించుకొనుచుండెను.

ఆగ్రామోద్యోగి యిదియేమిచిత్రమో గాంచవలెనని యా కాపువాని యింటి కరుదెంచెను. గ్రామోద్యోగితో లోపలికేగ వచ్చును గదా యని కొందరు బాలు రాతనిని వెంబడించిరి.

ఆతడా కాపు యిలుసొచ్చినది తడవుగ నాతని కాకాపు భార్య యీమనుష్యాకారముగ నున్న వింతమృగమును చూపించెను. యిదియేదో కోతిజాతికి సంబంధించిన దనియు, ముఖము నందు వెంట్రుక లుండుటంజేసి పురుషజాతికి సంబంధించిన దనియు, దీని కేదేని ఆటపాటలు నేర్పి, దీనివలనకొంత ధనధాన్యములు సంపాదించుకొన వచ్చునని యా గ్రామాధికారి ఆ యాడు దానికి బోధించెను.

అదియు తన మగని కీయుపాయము జెప్పినది తడవు గాతడు అప్పటికప్పుడొక పంజరము నమర్చి దానికి ద్వారముసహిత మేర్పరచి దానిలో నాపులుగునుంచి, కూర్చొనమని సైగజేయుగ నది యట్లు గావించె, తిరుగ లేచి యెగురమని అరువగనే చెవులు చిల్లులు వోవునట్లరచు నా కేకకు చంద్రవదనుడు చెవులు మూసుకొని లేచి యెగురుచు నాడుచు నిలుపంబడెను.

యీా మృగమునకు మనుజభాషకూడా తెలియుననియు, యేమిచేయమనిన నది చేయుగలదనియు గ్రహించి, గ్రామగ్రామ

మునకు దానినెత్తికొని పోవుచూం బియ్యమును, రొఖ్ఖమును సంపాదించుకొన మొదలిడెను.

యీవార్తప్పుడే చుట్టుపట్ల గ్రామాదు లన్నిటికి తెలిసి పోయినది. అప్పటినుండియు నాతడిల్లుకదలకయే రూకలను సంపాదించుచుండెను. వారి యానుబిడ్డమాత్రము దాని కన్న పానీయములు మాటిమాటి కందించుచు ఆడించుకొనుచుండెను.

చంద్రవదనుడు తనయవస్తకు చింతించుచు, సుగుణఘట్టమున సత్యవాణీ, సుగుణవతు లేమిచేయుచుండిరో యనియు, తన మేనత్త పెనిమిటగు ఉదారసింహుడు రాజ్యముఁ జక్కగ పాలింపుచుండెనో లేదోననియు, కిశోరశింహుని యవస్త యెటులున్నదో ననియు, లోలోన కృసింపుచు యిక తానీ ప్రాంతము వదలి పోజాలనని నిశ్చేష్టుడై కుమిలికుమిలి నేడ్చుచుండెను.

యేదియెటుల జరిగినను, కిశోరు డిల్లుబయులు దేరిననాడు తన ధనాగారమును మూసివైచి దానికి సంబంధించిన బీగములు నాచేతి కిచ్చియుండెనుగదా! యన్నటికైనను కిశోరరాజును గాంచ లేకున్నచో నీబీగములు భద్రముగ నాతని సతి కొసంగవలెనని మాటిమాటి కాబీగములు తన మొలయందున్నవో లేవోనని చూచుకొనుచు నవి జ్ఞాపకము వచ్చినప్పుడెల్ల తన యేలికన్గూర్చి చింతించుచు, ప్రొద్దుబుచ్చుకొనుచుండెను.

తానుండునది భూస్వామిగృహమై యుండుటంజేసి నాయింటియందుండు వ్యవసాయ పనిముట్లన్నియు నదేమిచిత్రమో కాని

బంగారు, వెండి, రాగి మొదలగు లోహములతో నమర్చి యుండు టా చంద్రవదనముఁగాంచి యాశ్చర్యమునొందుచు, తన్ను మున్ను కట్టిన గొలుసు సహా వెండిదై యుండుటకు కారణ మేమాయని యోచింపుచు, యినుముతో యేవస్తువు లేకుండుట కాశ్చర్యము నొందుచు, నాడు పాలములో తన్ను కాటందిన కొడవలి సహా తము వేరు లోహముతో నమర్చియుండుట కబ్బురమందుచు, అప్పు డప్పుడు తన మొలలోని బీగము చెవి నెవరో కదలించి నట్లుండ నులికిపడి దానిని తడుముకొని తృప్తిజెందుచు, తాను మున్ను పక్షిని డిగ్గినదాదిగా గాంచిన పర్వతపంక్తు లేవో పశువులనియు, తన కడ్డగించిన గోడయొక పెనుసర్పమనియు, ఆకసమున చీకటులు గ్రమ్మజేసిన దొక పక్షి తనరెక్కలచే సూర్యకిరణములను మాటు పరచెననియు, యివి యన్నియు దీర్ఘకాయముగల జీవులని తలంచుకొనుచు, తానిక నిచ్చట చావ వలశినదే నని తీర్మానించు కొనెను.

మణికంధరా! కిశోరశింహ చంద్రవదనుల స్థితి యివ్విధం బుననున్నది. యిక నా యడవిమధ్యంబున వటవృక్షబంధితమగు అశ్వము లేమయ్యెనో మాతమని పల్క నౌను స్వామీ! అన్న ట్లా గుర్రము లేమయ్యెనో గదాయని యాతురత పడుచు వినిన కొలది సంతాపమును వెల్లడించుచు, కొన్ని సమయములందు సంతోషముఁ వెదజల్లుచు, నా విప్రవర్యుని పాదము లొత్తుచుండగ మణికంధరునకివ్విధంబున చెప్పఁదొడంగె.

ఆనాడట్లడవిలో యీరాత్రి కిచ్చుటనే విడియుడనియు, బహుదూర ప్రయాణము గావించినంగాని మీ కేదేని యూరు కాన్పట్టదనియు, కిశోరశింహ చంద్రవదనులకు చెప్పి యట్లుగావింపజేసిన యాకాపు మరునాడుదయమున తిరుగ నా ప్రాంతమున నే తాను దిమ్మరుచుండెను.

అడవిలోని తేనెలను, ఎదురు బియ్యమును, కాయలు, పండ్లను, పోగుచేసి పట్టణములకు బండ్లపై తన పనివారలచేపంపి ధనమును సంపాదించు వ్యాపార మాతనికి.

కాని ఆతడు మాత్రి మీావటవృక్ష ప్రాంతముననే. అట్టిపని జేయుచుండును. కారణమేమన దుష్టమృగముల బాధ లేకుండుటయే.

మరునాటి యుదయమున నరుదెంచిన యాకాపీ రెండుగుర్రములనుజూచి ఆశ్చర్యచిత్తుడై యిదియేమి, యీతురగము లిచ్చటయుండుటకును, ఆ నవయవ్వన సుకుమారులగు యువకులు కాన్పించ నందుకాశ్చర్య భయచిత్తుండై, వీరికేదైనను కీడుసంభవించినదాయని పరిపరి విధంబు లాలోచించి తనకేమి తోచకుండుటచే కానిమ్మేమి. జరిగిననుసరియే పాప మాహార పానీయములు లేని యీనోరులేని పశువులను రక్షించెద గాకయని తురగముల నాతటాకము దరికి గొంపోయి జలంబులం దాృవించి పచ్చగానుండు నా ప్రదేశము నందించుక సేపు పచ్చికను మేపుకొని తనవప్కరులరుదెంచగా వారికీ యశ్వములను భద్రముగ పోషింపంజేయు

డని యాజ్ఞనిడ నా గుఱ్ఱములను నిజవాసంబునకుఁ గొంపోయి పోషింపుచుండిరి.

సుగుణఘట్టమున సత్యవాణీ సుగుణవతు లిందిరసహితము గా నొకే యున్నత భవనమునందు పురాణకథలుఁ జెప్పుకొనుచు, తననాథు డెప్పుడరుదెంచునో కదాయని మాటిమాటికి నిట్టూర్పు విడచుచున్న సత్యవాణికా, సుగుణవతి అమ్మా ! పుణ్యక్షేత్ర మగు నాపండరిని దర్శింపుభాగ్యము వారికి కల్గినందుకు మన మెంతయు సంతసింప వలయునుగాని, యిట్లు విచారింప తగదనియు నీనాథునకు నీపై ప్రేమలేక పోలేదనియు, ఇందిర వివాహాతొంద రైన నామహారాజు నిల్లు త్వరలో జేర్చగలదనియు, చెప్పుచు, కిశోరశింహ చంద్రవదనుల రాక కాయంగనామణు లెదురుజూ చుచుండిరి.

మణికంధరా, సుగుణఘట్టమున, నీతిరుగను, అశ్వము లా తిరుగను, కిశోరుడు కారాగారమునందును, చంద్రవదను డట్లు పంజరమునందును సుగుణఘట్టరాజ, మంత్రికుటుంబము లివ్విధం బున నున్నవి.

కిశోరు డానాడట్లు చరసాలయందు ప్రథమప్రవేశమయ్యెను గదా! వానిసంగతెట్లున్నదో చూతమని యాభూసురుం డివ్విధం బున బల్కదొడంగె.

మణికంధరా !

అకాలమున నా రాజ శేవకు లొసంగు నాహారమును భుజిం

పుచు, తోటివారితో నానావిధములగు పనులు జేయుచు, మంత్రి కుమారు డానా డవ్విధంబున ధనదాన మొసంగ నివ్వనందుకు గదా, నేడు నాకీ ఫలితము నాజీవితకాల మివ్విధంబున కాయకష్ట ములుఁ జేయుచు కారాగారమందుండ వలశినదేనా? యిక నాజీవి తేశ్వరినిగాంచ జాలనుకదా? నాప్రజలు నాదురవస్త నెరింగినచో నెంత చింతింతురో కదా! నేనిట్లు విధివశంబున చిక్కుపడితినని నాయర్ధాంగికి తెల్పువారెవ్వరు? అయ్యో, ఆలలనామణి నాయ వస్తనెరింగినచో తన జీవములను తప్పక కోల్పోవును. నేనట్లు చేయరాదు. యన్నటికైనను భగవంతుడు నా యీ యవస్త తప్పింపకపోడు. అన్నట్లా చంద్రవదను డానాడు యే కొండలో యలోనో పడి చచ్చియుండడుగదా? అట్లు జరుగకుండిన నేను ధన్యుడనౌదును. యెన్నటికైన నాతడు నన్ను కనుగొనకపోడు. బుద్ధిశాలియగు నాచంద్రవదను డెవ్విధంబున నైనను నన్ను రక్షిం పకపోడని యాతని రాకకు దినములను లెక్కించుకొనుచు ప్రొద్దు బుచ్చుకొనుచుండెను.

శ్రద్ధగ నన్నపానాదు లొసంగి కడుజాగరూకతగా పంజర మునందు పెరుగుచున్న చంద్రవదనుడు తనస్వామి కెంతయో ధన మును సంపాదించి యిచ్చెను. ప్రతివ్యక్తియు నాతని చేష్టలను జూచి కడుపుబ్బ నవ్వుచుండెను. కొన్ని అణాలు ఖర్చయినను, చూచినవారు తిరుగ జూచుచుండిరి. అన్నిప్రదేశములందును,యీ వింతమృగముయొక్క ఆలోచనలే. యేడ్చుచున్న తమతమబిడ్డలకీ

వింతమృగముచే కరపించెదమని భయపెట్టుచుండిరి.

యిట్లుండగా నాయూరి కెచ్చటనుండియో అడవి కోతొకటొచ్చి ప్రతి యింటను దూరి కోతి చేష్టలను జేయుచు బిడ్డలను గాయ పరచుచు, నా గ్రామవాసులను సర్వవిధముల బాధింపుచుండెను.

ఏకనాడా కోతీ కాపువాని యింటిపై కెక్కినది తడవుగ వాని బిడ్డ కెవ్వుమని యరచుచు లోనికి పారిపోయెను. అప్పుడా కోతి పాపము పంజరమునందు చిక్కుపడి యుండు చంద్రవదనుని పంజరము నెత్తుకొని పారిపోయెను.

సుఖముగ జీవించు చుంటిమి గదా యని తలంచునాకాపునకీ కోతి యెచ్చటనుండి దాపురించినదో కాని పాపమాతని జీవనమునకు చేటు తెచ్చి తనకుటుంబమునకు నష్టముఁ గలుగ జేసెను.

నిరతమన్న పానాములొసంగి కడుశ్రద్ధగ పెంచుచుండిన నా కాపు కూతురీ చంద్రవదనునిఁ గొనిపోయిన కోతిని తిట్టుచూఅన్న పానాదు లొల్లక కొన్నిరోజులు చింతించెను.

వింతమృగమును చూడవచ్చిన ప్రజలందరు నిట్టూర్పు విడచుచునుస్నురుమని తమ తమ యిండ్లకేగుచుండిరి. కొద్దికాలములోనే వింతమృగమును పంజరముసహితముగా అడవి కోతొకటి తీసికొని పోయినదని తెలిసిపోయెను.

ఆ యూరి గ్రామాధి కారి యాకాపును దూరుచు, సుఖముగ బ్రతుకు చుండిన నీమరదృష్టమనిచెప్పుచు, అంత అజాగ్రత్త

యే నీకింత చేసినదని బిగ్గరగ కేకలిడెను.

చంద్రవదనుని గొని పోయిన నా యడవికోతి కొన్ని యామడలు పరువిడెను.

యీ మర్కటము నన్నేమి చేయునో కదా? యేదేని జల మధ్యంబున గాని, పర్వతాగ్రము నందు గాని, చెర్చదు గదా? అమ్మయ్యో! అట్లు గావించిన నాకిక బ్రతుకుపై నాశ లేదు గదా? యని అనేక విధముల తలంచు కొనుచు చంద్రవదను డా మర్కటము చేతనుండు పంజరములో తహతహ లాడుచుండెను.

కాని మాటి మాటి కాతని యొద్దనుండు బీగము చేతులు మాత్రము తీవ్రముగ కదలుచు, ఒక్కొక పర్యాయము బలముగ తన్నుగూడ నా పంజరము దరికి లాగుచుండెను. యిట్లుండ నాక స్మికముగ నదేమి చిత్రమో కాని యా చంద్రవదనుడు తానుండు పంజరమునుండి నిమేష మాత్రమున వేరుపరచబడి గగన మార్గమున గాలిపటము వలె రివ్వన తూర్పుదిశకు పోదొడంగెను. అప్పుడా చంద్రవదనుడు యిది యేదియో మాయ యని తలంచి కొన్ని నిమిషములలో యిక తాను యమపురి కేగవలశిన దేనని, తనరాజు, మరియు సర్ధాంగి మొదలుగా గల సమస్త బాంధుకోటి పైనాశలు వదలుకొని జీవచ్ఛవమై పోయెను. దేహము నందు ముచ్చెమ్మటలు గ్రమ్మె! గుండియలు తటతట కొట్టుకొన జొచ్చెను.

యింతలోనే నాతడొక పర్వతమునకు తటాలున తగులు కొని యందంటుక పోయెను. కాని దైవాను గ్రహము వలన నా

తని కేలాటి దెబ్బలు తగిలి యుండలేదు. యించుకవడి మూర్ఛ జెందిన వానివలె నట్లె అలసట దీర్చుకొని తానటనుండి తప్పు కొనుట కేదేని మార్గమున్నదా యని తలంచుచు తన శక్తికొలది ప్రియత్నించెను. కాని తన మొలయందుండు బీగము లాపర్వతము న కంటుకొని యూడిరావయ్యె.

అప్పుడా చంద్రవదను డియ్యది యసాంత పర్వతమని నెరింగిన వాడై తొళపు చేతులు తనమొలనుండి వేరుపరచిన నీపర్వ తము నుండి వేరుకావచ్చునని యెంచి, అట్లు గావించిన ధనాగార బీగములు యిందే చిక్కువడు ననియు, అయస్కాంతము నెట్లు తప్పించి యీబీగముల గైకొన గలననియు, యీ ప్రాంత్యమునకు తానిదివరకుండు కాపు యూరుదగ్గరనే యున్నదనియు, అందుకు నిదర్శన మాకాపువాని యింటియందు వ్యవసాయ పనిముట్లన్నియు యితర లోహము తో నమర్చియుండు టేముఖ్య కారణమనియు, వాడు తన్ను బంధించిన గొలుసు సహిత మన్య లోహమనియు, దీర్ఘముగ నాలోచింప నాకాపు వాని యూరిచ్చటికి సామీప్య మని యెంచి మున్నాయూరనుండగనే తనబీగములప్పు డప్పుడెవరో కదలించి నట్లుండెననియు తెలిసికొని కర్తవ్య మూహింప దొడంగెను.

బీగము చెవి పోయినను బొక్కసము నెట్లయిన తెరువ వచ్చుననియు, ముందు తానీపర్వతమునుండి వేరుగు టగత్యమని యెంచి తనమొల త్రాడు సువర్ణముచే నమర్చినను వెంటనే

కొక్కెమును తప్పించెను.

అప్పు డమ్మహానీయుడు పర్వతము నుండి వేరయ్యె. అత డంతప్రయాసతో బీగము చేవిని తీసికొన లేకపోయినను తన మొల త్రాడిని మాత్రము పర్వతము నుండి వేరుపరచి గిరుగ తానలంక రించి కాలికి బుద్ధి జెప్పెను. యినుముతో నమర్చియుండు నా బీగ ములందె పర్వతమున కంటుకొని పోయెను.

ఇట్లామంత్రి పుంగ వుండు కొంతదూరము నడువగా మార్గ మధ్యంబున మునుపటి వలె నచ్చటచ్చట దీర్ఘ కాయము గల పక్షు లాకసము నందెగురుట, భూమిపై వ్రాలుటకూడా చూడ తటస్థ మయ్యెను.

కొన్ని మైళ్ళదూరమున కేమిగాని యిప్పటికా కాపుయూరు సమీపమున నే యుంటినని తెలిసికొనిన వాడై యా చంద్రవదను డేదిక్కు తోచక నిశ్చేష్టుడై యుండెను.

పాపమింత యాశతో నా పంజరమును దెచ్చిన మర్కటము పంజరము నందీ వింతమృగము లేనందు కెంతయు చింతించి యా పంజరము నేలకు కొట్టి తనదారినిఁబోయెను.

వింతమృగమును గోల్పోయిన కాపు కొన్ని రూకలను వెచ్చించి విసికి నిరాశ జెందెను.

అడవి మధ్యంబున దిమ్మరుచుండిన చంద్రవదనుడు తాను మున్నారోహించిన పక్షినాకస్మికముగా నాప్రాంతమునందు భూమి పై దిమ్మరుచుండుటగాంచెను. తానా రోహించిన పక్షియని త్వర

లోఁగ్రహించుటకు మున్నా పక్షి రెక్కలయందు చిక్కుపడిన వసన మట్టియుండుట మొదటికారణ మయ్యెను.

ఆ ప్రాంతము నందది కొన్ని మృగములను వేటాడి తనకు వలయునంత మాంసమును తిని సాయంసమయమునకు మిగిలిన దాని నెత్తుకొని పోసాగెను. తిరుగ తెల్లవారు సరికా మగపక్షి యా ప్రాంతముననే దిమ్మరునట్లు మంత్రిపుంగవుఁడు రెండుమూడు రోజులు పరికించి చూచుచుండెను.

మరునా డుదయమున నాపక్షి అందే తన క్షుత్తీర్చుకొని సాయంసమయమునకు కొంతమాంసము నొకచోట జేర్చి పెట్టుకొనెను.

స్వయముగ నీవింతనంతయుఁ జూచుచుండిన చంద్రవదను డీ పక్షి నిశ్చటివలెనే యీ మాంసము నెత్తుకొనిపోవునని గ్రహించి అది ఆ ప్రాంతమువీడి పోయినదితడవుగ నా మాంసకండరము లన్నిటిని తాను గన్పడకుండ గప్పుకొని చెట్లనుండి వేరుపరచబడిన తాటలతో నామాంసకండరములను బిరుగ తనదేహమునకుఁ గట్టుకొని భూమిపై పరుండెను.

సాయంసమయమున కాపక్షి తానుంచిన మాంసకండరములను తనముక్కుతో సునాయాసముగ మూపుపై నుంచుకొని వానితోపాటుండిన చంద్రవదనుని సహితముగ నాకసమార్గమును బట్టి రివ్వున నెగిరిపోయెను.

బ్రతికితినని యీ మంత్రిపుంగవుఁడు తన్ను బిగించుకొనిన

మాంసము వేరుపరచి నిశ్శబ్ధముగ నా పక్షిరాజము మూపుపై పండుకొని పరిపరి విధముల నాలోచించుకొనుచు, మున్ను తాను వదలిన వస్త్రమును తిరుగ తలపాగగ నమర్చుకొని యెప్పుడీ పక్షి భూమికి డిగ్గునాయని యాతురత పడుచుండెను.

గగనమార్గమం దెగురుచుండిన చంద్రవదనుడు తానిదివర కొకసారి యట్టి ప్రయాణముగ్నావించినందు నంతగా భీతిజెందక, ఆ ప్రదేశమంతయు వింతగ జూచుచుండెను. తా నింతకాలమునుండి పాతాళలోకమున నుంటిననియు, తన బాల్యావస్తయం దుదారశిం హుండు చెప్పిన కథలలో పాతాళలోక ప్రజలు చాలా దీర్ఘకాయు లని చెప్పిన మాట యదార్ధముగ తాను గాంచితిననియు, పరిపరి విధముల తలంచుకొనుచుండెను. యిట్లాయువకుడు తలంచుచుండ కొన్ని ఘుంటలలో నా పక్షిరాజము తన నివాసమగు యడవిమధ్య మునందు డిగ్గెను.

పాపమేదో జబ్బుగాయుండి తన మేతకొరకై పోజాలక తన నాధుడు దెచ్చు మాంసపు ముక్కలకొర కెదురుచూచుచున్న నాయాడుపక్షి తనభర్త రాక కెంతయు నుబ్బుచుండెను.

భూమిపై దిగిన యాపక్షి తన మూపుపైనున్న మాంసపు కండరములు క్రిందపడవైచి తనపెంటి కాహారముగ నిడెను.

క్షుద్బాధచే ఆతురతపడుచు తన పోతు తెచ్చిన యాహార మును భుజింప నుంకించుచుండ నందుండి నేదియో కదలుచున్న ట్లా పక్షి గ్రహించి ఆడుపక్షియగుటచేగాబోలు అందులకులికిపడి

ఆవలకు జనినదితడవుగ నందుండి మన సుగుణపురమంత్రి బయల్వెడి వడివడి సమీపమునందున్న తటాకముదరి జొచ్చెను.

అప్పుడా చంద్రవదనుడు మున్ను తాను రాజు సహితముగ మజిలీగావించిన ప్రదేశమనియు, మున్ను తన రాజారోహించిన పక్షియు, నదిగోనని జూపెట్టుచు నదియు కొంతమేలేనని కర్తవ్య మూహించుచుండ నంతలో భాను డస్తాద్రికేగెను.

తానా తటాకజలమును కడుపార గ్రోలి నటునిటుపచారుఁ జేయుచుండగా నా ప్రాంతము నందే కొంద రడవిజాతివారు దిమ్మరుచు నా తటాకజలములచే కాలుచేతులు శుద్ధిపరచుకొని తమతోనుండిన రొట్టియలు నొకచోగూర్చుండి భుజింపుచుండు టీ చంద్రవదనుడెరింగి స్వదేశమనుష్యులు కనబడినందు కెంతయో కన్నులపండువుగ వారికడకరిగి అన్నలారా! మీదేయూరు? మీరీప్రాంతమున కెచ్చటనుండి వచ్చితిరనిప్రశ్నింప నందొక నడి కారుమనిషి నాయనా మాదీప్రాంతమున పదిక్రోసుల దూరమున నుండు "గోకుల"యను పల్లెటూరు. మేమీప్రాంతమునందు తేనెలు, యెదురుబియ్యము, పండ్లు మొదలగు అడవిపదార్థములను గొంపోయి పట్టణములందు విక్రయించుకొనుట మా వ్యాపారమని జెప్పుచు, బిడ్డా నీదేయూరు? నీవాకలిబాధచే తహతహపడుచున్న ట్లు గాన్పించుచున్నది. మాకడ కొన్ని రొట్టియలున్నవి. వానినార గించెదవేయని పల్కినదితడవుగ నామంత్రి యట్లు గావించెను.

చల్లని పిల్లవాయువులు వీచుచుండు నాతటాకపుటొడ్డుననే

వారందరు తమతమ వస్త్రములు పరచుకొని హాయిగ పండుకొనిరి.

ఆకలిబాధచే తన నిజవాసం బెరింగింపజాలని చంద్రవదనుని తిరుగ నావ్యక్తి తండ్రి, తమదేయూరని యడుగ నాసుగుణవతీవల్లభుండు తనచరిత్రయంతయు రాజుతో తాను మున్నియడవి జొచ్చువరకు జెప్పెను.

అంతట నాకాపు దిగ్గున లేచికూర్చుండి అట్లైన మీ యశ్వములు నాకడ నున్నవి. వానిని భద్రపరచి నా యింట పోషింపుచుంటిని. నాయనా! ఆనాడు నీతోవచ్చిన రెండవ కుమారుడెందుండె? వానికేమియు నాపద సంభవించి యుండదుగదా యని, యాకాపు జాలినొందిన వానివలె నడుగ నా చంద్రవదనుడందుల కెంతయు నచ్చెరువొంది, నాడీయరణ్యమున కొన్నిమైళ్లు మీ రశ్వములపై నేగినను, వూరుగాని పల్లెగాని గాంచజాలరని చెప్పిన మహానీయు డీతడేనని గ్రహించి, అయ్యా, నాడీ యరణ్యమందు మాకేహానియు రాదనియు, నేటిరాత్రిచ్చట గడప వచ్చునని చెప్పియుంటిరిగదా యనినదితడవుగ నావర్తకు డౌనౌనని చెప్పి మిగిలిన నీస్నేహితు డేమయ్యెనని యాతురతగా నడుగ నావ్యక్తికి జరిగిన కధయంతయు జెప్ప దానికి వారంద రాశ్చర్యభయచిత్తులై మీ రెట్టులయిన తప్పుకొంటిరి. కాని పాపమా రాచెపట్టి యేమయ్యెనో గదాయని పల్కుచు, నాయనా మీయశ్వములను మీ కప్పగించెదను, మీరిక మీ యిలుజేరి మీ రెనను సుఖముగ

నుండుదు. జీవములుండెనేని యున్నటికైన మీరా యిల్లుఁజేరగలడని బల్క దానికా మంత్రి అన్నా! అట్లుగావించుట రాజద్రోహము కాదా? రాజులేక నేనొంటిగ నిల్లుచేరుటెట్లు? అట్లు జరిగించి నే నిల్లుచేరితినేని మహారాణిగారి ముఖ మెట్లుజూతును? యున్నటికేని రాజు తిరుగ యింటికివచ్చిన నన్ను నమ్మకద్రోహివని దూషింపడా? రాజును గాంచనిది నేనిల్లుజేరనని పల్క నా వ్యక్తులందరు నాతని రాజభక్తి కెంతయు నాశ్చర్యపడిరి.

మెండియు నాచంద్రవదనుని గాంచి అటులైన కర్తవ్యమే మని యూహింపదలచిరని నాకాపు ప్రశ్నింప నందుల కివ్విధం బున ప్రత్యుత్తర మివ్వదొడంగె.

యెటులైనను నేను రాజులేక యిల్లుఁజేరననుట వాస్తవము. యీయాడుపక్షి తనప్రయాణ మేదారిని జరిగించునో దాని ననుస రించి యెప్పటికైన నాతనిని కలశికొందునని పల్క, అటులైన నో చంద్రవదనా, నావద్దనున్న మీ రెండశ్వములను మీకప్పగించెదను. మీ రేదేని ఁజేసికొండన, అయ్యా, అటులకాదు. వాటిని తిరుగ నేను రాజుసహితముగ నిచ్చటికి వచ్చువరకు భద్రపరచుడని బ్రతిమాలి యుంటుల కాతనినొప్పించెను.

మరియు నాకాపువానిన్గాంచి పూర్వము నేను రాజుసహి తముగ విడిసినప్రదేశ మిమ్యాదియేకదా? నేనేమియు పొరబడుట లేదుగదా? యని యడిగి తాను జాగ్రత్త దశలోనే యున్నట్లా కాపువలన తెలుసుకొని, చాలా పొద్దుపోయినందున అందరును

హాయిగ నిదిృంచిరి. కాని పాపమీ చందృవదనుడు తనరాజు నెప్పుడు గాంతునాయని పరితపించుచు నిదృపోయిన పాపమున పోలేదు.

మరునాటియుదయమున ఆవ్యక్తులు పెందలకడలేచి రాజు కొరకై బహుకాలము పరితపించి అప్పటి కనతికాలములోనే కన్ను కూరికిన నాచంద్రవదనుని మేల్కొలిపి అయ్యా, యికను మానిత్య కృత్యములకు మేమేగుచున్నాము. మీయశ్వములను మీ రెప్పుడు కోరినను జీవములతోనుండెనేని వాటిని మీ కప్పగించెదమని చెప్పి తమతమ పనులకై వెళ్ళిపోయిరి.

మరునా డుదయమున మంత్రికొమారు డాప్రాంతమునందే తిరుగుచు, నాడు రెండుపక్షులు తమతమస్థానమునందు లేకుండుట గాంచి నేడాడుపక్షిగూడ తనయాహారార్థము వెడలి యుండునని గృహించి కర్తవ్య మూహించుచు, నాటిదినమంతయు గడపెను.

సాయంసమయమునకు పక్షిరాజములు రెండును తమ విధి ప్రకార మచ్చోటలంకరించెను.

కానిమ్మేమిజరుగునో చూతమని నాటి అర్థరాత్రిృంబున తానా యాడుపక్షిపై కపృమత్తుడై నెక్కి సూర్యోదయముకొరకు నిరీక్షించుచుండెను.

పక్షులపై ప్రయాణముసాగించుట మనవా డలవాటు పడి నందున నుంచుకేనియు భీతిల్లక, కదలమెదలకందుండెను. మరునా డుదయమున యెప్పటివలె నాపక్షులుతమతమ యాహారార్థము

పోతు ఉత్తరపుదిక్కునకునూ, పెంటి దక్షిణపు దిక్కున కెగయ జొచ్చెను. కొంత దవ్వరిగినపిమ్మట నాయాంధుపక్షి మునుపటివలెనే నేదో తనపై నెక్కినదని గ్రహించి యింతకాలమునుండీ పాంత మున నిద్రించుచుండినను, మాపై నేదియు నెక్కియుండలేదే యిది యేమియాశ్చర్య మిట్లుజరుగుచున్నదని భీతిజెందినదై ఆకసమున నెగురుచు తాను మున్ను రాచపట్టిని భూమిపైదించిన ప్రదేశము ననే భూమిపైకి వ్రాలినదితడవుగ నాచంద్రవదను డదియొక వృక్ష సమీపమైనందున మెల్లగ నాతడు దానిపైనుండి వృక్షము నారో హించినది తడవుగ నాపక్షి మునుపటివలెనే తనదారిం నేగెను.

మంత్రివర్యుండంత నావృక్షమునుండి డిగ్గి బ్రతుకుజీవుడా యని మా రాజ్యప్రాంతమునందు దిమ్మరు చున్నాడు గాబోలు. యిక నాతని ననతికాలములోనే చూడగలనని నుబ్బుచు నా దట్ట మగు దండకారణ్యమంతయు కలయవెతకెను.

ప్రయాసపడి యాదండకారణ్యమంతయు వెతకినను, తన రాజునుగాని ఆతని జాడలనుగాని తెలిసికొనజాలడయ్యె.

కిశోరుని గాంచక నేనిల్లుజేరనను ప్రతిజ్ఞబూనిన నాచంద్ర వదనుడు ఆకలిదప్పులకోర్చి రెండురోజులు తిరిగితిరిగి అలసట జెం దినవాని కా మరునాటి యుదయమున నొక కొలనుగాన్పించెను. దానియొడ్డున నొక యెంటె పచ్చిక మేయుచుండుటగాంచి దాని యజమానియు నాచేరువనే యుండవచ్చునని తలంచి దానిచేరువ కరిగెను.

కాని కనుచూపుమేర జూచినను మనుష్యమాత్రుఁ డెవ్వ డచ్చట గాన్పించనందున నందొక యెత్తైన వృక్షమునెక్కి నలు దిక్కుల పరికించిచూచినను నాత డెవ్వరిని గాంచ జాలడయ్యె. తిరుగ నాతడా వృక్షమునుండి దిగి నాలొట్టియ చేరువనకరుదెంచి నదితడవుగ నది కొన్నిదినములనుండి మనుష్యమాత్రుని జాడల నెరుంగక పచ్చికమేయుచు, నాకొలనులోని నీరుత్రాగుచు, నంచే పరుండుచు, పొద్దుబుచ్చుకొనునట్టి నాలొట్టియ యీా మనుష్యుని గాంచి తన నిడుపగు మెడను పైకెత్తి యరువజొచ్చెను.

మరియు నా సమీాపముననే నొక పెద్దగోనెయు, దాని నిండుగ చీమలు, యీాగలు విశేషముగ జేరి యందుండు బెల్లము మొదలగు పదార్థముల నారగించుటయుఁ గాంచెను.

అప్పుడా మంత్రిపుంగవుడగు చంద్రవదను డిదియేదో వ్యాపారస్థులకు సంబంధించినదనియు, తప్పిపోయి యిందుజేరి కొన్నిదినములనుం డిచ్చోట పొద్దుబుచ్చుచున్నదని యెరింగిన వాడై తాను నాకొలనులో జలకమాడి మురికిచే వికారముగ కన్పట్టు తన వస్త్రములన్నియు నందు శుభ్రపరచుకొని ఈగలు, చీమలు తిను గోనెలోనుండు నాహారమునందు తాను నొకపాలు గైకొని క్షుద్బాధ కొంతతీర్చుకొని నాలొట్టిపిట్టను కొన్ని ఘంటల లోనే మచ్చికపరచుకొని దాని నారోహించి నొకమార్గమునుబట్టి పోదొడంగెను.

యిట్లాతడు కొన్నిఘంటలు ప్రయాణముసాగించెను. తన యూరుదారి ఒంటెకు బాగుగా తెలిసినందున నదియు తిన్నగ తన పట్టణమగు విజయరాజపురమునకు చేరుకొనెను.

మంత్రిపుంగవుడగు చంద్రవదనుడు తాను స్వరాజ్యసంబంధమగు పట్టణమును, అట్టిప్రజలనుగాంచి అపరిమితానంద భరితుడయ్యెను. పెండియు నాతడా పట్టణము చేరువనే నొకచోఁడిగ్గి నా యొంటె నొకవృక్షమునకు బంధించి తనయొద్దనొక కాసైన లేని లోపముచే తన మొలనుండు సువర్ణత్రాడు నూడబెరికి దాని నా పట్టణమునందు కొన్నిరూకలకు హామీగానుంచి వానిచే వంట సామాగ్రియు, మరియు నాతడారోహించిన లొట్టియ కాహారము ను నొకకూలివానిచే బట్టించుకొని వచ్చి ఆహారమా యొంటెకుపడ వైచి తానా పదార్థములను పుచ్చుకొని నిరుపేదయగు నాకూలి వానికి కొన్ని యణాలిచ్చి పొమ్మనియెను.

అంత నాబీదవాడు స్వామీ! యీలొట్టియ తమకెక్కడిది? యిది మాపట్టణమందు వర్తకశ్రేష్ఠులలో నొకరిది. పాపమావణు జులీయొంటెను గోల్పోయి యిప్పటికి రెండుమాసములు షుమారు కావచ్చినది. దీని నెవరేని తమకువిక్రయించిరా? లేక యిదితమకు లభించుటెట్లు తటస్థమైనదని ప్రశ్నింప, దానికా చంద్రవదను డెంతయు నచ్చెరువొంది, వోయీ! యీవొంటె నెచ్చట కోల్పో యిరి? దీనిపై నేదేని బరువుయున్నదా? లేక ఒంటెనుమాత్రము గోల్పోయిరా? యని యడుగ, స్వామీ! దీనిపై కొన్ని సామా

నులుకూడా వారు కోలోఁపెయి నప్పు డుండెనట యని బదులుఁ జెప్పెను.

యీ సమాచారము నీ కెట్లు తెలియునని యా సుగుణఘట్ట మంత్రి తిరుగ నాబీదవానినడుగ, స్వామీ! తమవలెనే నొకమహా నీయుడు బజారునుండి సామానులను నాచేఁ బట్టించుకొని పోవు చూడ నామార్గము రాజశింహద్వారము ప్రక్కనుండి పోవుచుండ గా యీవొంటె యజమానులగు నా వణుజ శ్రేష్ఠులు తమ యొం టెను యిచ్చటికి కొన్ని మైళ్ళదూరము నందుం డరణ్యములో గోల్పోతిమనియు, దానికీయొంటెయందుండునన్ని కళలను గుర్తులను రాజుగారికి విన్నవించుచుండ నేనువిని దీనిని గుర్తించగలిగితిని.

వెండియు, నేనంతగా పరికించి నావిషయముచూడ నగత్య ములేదు కాని, పాప మెవ్వరినో నీయొంటె నపహరించెనని బంధించి రాజున కప్పగింపగా జనసమూహామునుఁజూచి నేను నాచెంతకేగ నీవృత్తాంతము తెలిసికొనగలిగితినని చెప్పుచు నాత డయ్యా, నేనే గెదను. యింక నేదేని కూలిని సంపాదించుకొనిన గాని నాకు నేటికి సరిపడదని చెప్పుచు నాతడా ప్రాంతమునువీడి పోవుచుండ నా మం త్రిపుంగవు డీతనిపల్కులకెంతయు నబ్బురమంది, వోయీ! నీ కీ నాటికి వలశినంత కూలినిచ్చెదను. నీవు నాకడ నేటికుండుమని వాని నాత డొప్పించి నందేయుంచెను.

తరువాత నేమిజరిగినదని యామంత్రిపుంగవుడు ప్రశ్నింప స్వామీ, యాబంధితు డెవ్వడో కాని షుమారు యిరువైయియిదు

వత్సరముల ప్రాయముగలిగి బహు సుకుమారత్వముగ గాన్పట్టుచు చూచువారందరి కాతఁడు నిర్దోషి యనిపించునట్లు గాన్పట్టెను. కాని వణుజు లాతడుఁ జెప్పిన లక్షణములన్నియు మాయొంటికడగల వని దానిలక్షణములన్నియు నీయొంటెనుబోల్చి యివ్విధంబుననతడు జెప్పదొడంగెననియు, విపులపరచితమలొట్టియనుతానుచూడలేదని చెప్పుచున్నాడనియు, అలా తాను గాంచనిచో ఆలొట్టియ నెట్లు గుర్తించెననియు, నామహారాజుకడ మాయూరివణుజులు రాయి గుద్దినట్లు మాట్లాడినంత మాత్రముననే మహారాజొక్క పరిశ్న యేని ఆసుకుమారునడుగక వెండియు నాత డెద్దియోఁ జెప్పబోవ వినక కారాగారమందుంచుడని యాజ్ఞాపించినది తడవుగ రాజభటు లట్లుగావించిరి. నాటినుండియు సుకుమారియగు నావ్యక్తి కారా గారములో నేటికిని పడరాని యిడుమలుబడుచు నందే కుములు చుండెనని చెప్పెను.

మంత్రియు క్షుద్బాధా పీడితుడై యుండినందున త్వరలో స్వయంపాక మొనర్చుకొని తా నారగించిన పిమ్మట నా కూలి వానికికూడ తృప్తిగనొసంగి కారాగారమునందు చిక్కువడినది కిశో రుడేననియు, నేనానాడు ధన దానమొసంగ నీయకుండినందుకు గదా, రాజేంద్రునకింతటి యవస్తసంభవించినది? ముందు నేనాతనిని చరసాలనుండి విముక్తునిగావించుటెట్లు? నాడు ప్రళయకాల రుద్రు నివలె మండిపడి శపించిన యాపండరివాసుడగు జడదారి శాపగడ వప్పుడే చేరువయయ్యె నేయని పెద్దయుంబ్రొద్దువిచారింపదొడంగెను.

తనతోయున్న నా బీదవానితో, నోరీ యీ పట్టణమేలు మహారాజెవ్వరు? వారికెచ్చుటెచ్చుట బంధువులు గలరు? వారి చరిత్ర నీకేమైన తెలియునా యనియడుగ, బాబూ, నా కంతగా తెలియదు. మాయింటికెదురుగా నొక గృహమున్నది. దానిలో ప్రభువుగారి యాస్థానసంబంధమగునొక యుద్యోగిగలడు వానివలన తమరు సమస్తవిషయములు తెలిసికొనగల రనెను. అటులైన మనమేగుదమని లొట్టియ నట్టులే కట్టియుంచి తానా ప్రభుత్వో ద్యోగి యింటికా కూలీడు వెంటరాగా వెళ్ళెను. ఆతడు నప్పుడే భుజించి వాకిట పచారుచేయుచుండగా చంద్రవదనుడు కూలివా నిచే వానినెరింగి సమీపమునకరగి నమస్కరించి తమతో కొన్ని నిమిషములు మాట్లాడనచ్చునాయని ప్రశ్నించి తగు ప్రత్యుత్తర మునుబొంది లోనికేగి వుభయు లుచితాసనం బలంకరించిరి.

అప్పుడా చంద్రవదను డయ్యా, నేను సుగుణఘట్టా ధీశుం డగు కిశోరుని మంత్రిని. నన్ను చంద్రవదనుడందురు. కొన్ని కార ణములవల్ల నేను సుగుణఘట్టమునుండి బయలుదేరితిననగా నాత డత్యంతాశ్చర్యాతురతతో లేచి నమస్కరించి తమరు నా బోటి వానితో నేమిపనియుండి వచ్చిరి? సుగుణఘట్టమున కిశోరశింహ మహారాజు క్షేమమా! ప్రజలు రాజాజ్ఞకనుగుణ్యముగ వర్తింపు చున్నారా? మీరాజుగారిచెల్లెలు యిందిరాదేవిగారికి నేదియో జబ్బుతటస్థమైనదని వింటి నామెయు కులాసగ నున్నదా? యని పూర్వ మాతనిని బాగుగ నెరిగినవానివలె నడిగెను.

చంద్రవదను డదియు నొక సహాయ్యమేనని గ్రహించి మీ రు మారాజకుటుంబము నెల్లెరుంగుదురని ప్రశ్నింప, సరిసరి వారి నెరుంగ కేమి, నేనెన్ని పర్యాయములో మారాజుగారంప నచ్చటి కేగియుండలేదా? కాని అప్పుడు కిశోరశింహుడు బాల్యదశయం దుండెను. నేను సుగుణఘట్టమును తిలకించిన నాటిరాజును, మం త్రియుంగూడ గతించిరి. యిప్పుడు కిశోరరాజు శింహాసన మధి ష్టించినపిమ్మట వారిని చూడలేదు. త్వరలోనే మేమును సుగుణ ఘట్టమున కరుగవలయునని ప్రయాణమగుచున్నాము. యువరా జుగా యున్నప్పుడు తండ్రిగారిచే సుగుణఘట్టపురాజులు మనకు కేవలము సమీపబాంధవ్యులని చెప్పుటయేగాని యింతవరకు మా రాజుగారు మీనరపాలుని జూచియుండలేదు. క్షేమ సమాచార ములు మాత్ర మొండొరులు తెలుసుకొను చుండిరి. దానంజేసి యీసారి రాజుగారు స్వయముగవత్తురు. యిందిరాదేవిగారు త్వర లోమాకు రాణికాగలదనెను. మంత్రియగు చంద్రవదను డో హో! యిదియెద్దియో సమీప బాంధవ్యముగా నున్నదేయని గ్ర హించి విషయము మాటుపరచి, నేనును నందుకోసరమే వచ్చి యుంటిననియు, నన్నెవ్వ రెరుంగకుండ మీరాజుగారి స్థితిగతులను గాంచి రమ్మనిరి. కావున మీరు నారాక రాజునకెరింగించకుడని చంద్రవదనుడు బ్రతిమాలి నాతనినొప్పించెను.

అంతట నాప్రభుతోద్యోగి, మహాత్మా నొక్కచో మా రాజు తమకు సరిరాకపోయిన పోవచ్చుననుకొనుము. అంతటితో

బాంధవ్యము వదలుకొనుట ధర్మమా? కిశోరశింహునకు మా రాజు కేవలముసమీపబాంధవ్యుడుకదా? అట్టి సమీప బాంధవ్యము వదలవచ్చునా? యని ప్రశ్నింప మిత్రమా మనకెందులకు వారు వారెట్లయినను సమర్థించుకొనగలరు. మనము ప్రయత్నించు వారమేకాని సమర్థించు వారముకాదుగదా? యని యేమో తెలిసినవానివలె నటించి తనకు పట్టణమందు ముఖ్యకట్టడములు, రాజకచ్చేరీలు కారాగారములు మున్నగు నన్ని ముఖ్యప్రదేశములను తిలకించుట కెవ్వరాజ్ఞ కావలెనని యడుగ, అట్టి యుద్యోగము తనదే యైనందున నొకరశీదును వ్రాసియిచ్చి యీచీటీని తమ యొద్ద నుంచుకొని ఆయాప్రదేశములందు ముఖద్వారమున నుండు వారికీరశీదు చూపిన లోనికేగవచ్చునని చెప్పి, తాను శలవుగైకొనెదననియు, మీ రన్నిప్రదేశములుచూచి తిరుగ తనకొకపర్యాయము దర్శనమిప్పింపవలెననియు, మన ముభయులమాటలన్యులకు తెలియరాదనియు చెప్పి రాజకచ్చేరికరగెను. చంద్రవదనుడును, వెంటవచ్చి తనరాక కెదురుచూచుచుండినవాకూలివానిని రావించి యోరీ, నీవు తక్షణమే మన లొట్టియయుండు చోటునకరిగి దానిని కాచియుండుము. నేను సాయంసమయమున కరుదెంచెద నన నాతడు భయముచే తండ్రి ఆలొట్టియకడనున్న నన్నెవ్వరేని కారాగారమునకు నెట్టరుగదాయన, నా చంద్రవదను డట్లుజరుగదని చెప్పి వానినొప్పించి మరికొంత పైక మాతనికిచ్చి పొమ్మనిన వాడట్లుగావించెను.

కిశోరమంత్రియగు చంద్రవదనునకు పూర్వమున కన్న వే మడంగు లధికముగ సంతోషముకల్గినది. వేగముగ ముందుపట్టణ మందు చరసాలను దర్శింపనేగెను. తాను నడచునది భూమియో లేక నాకసమో తనకు తెలియనంతటి యానంద మాతనికి గల్గెను.

చరసాల ముఖద్వారమున నీరసీదు చూపగనే నాకాపరి రెండుచేతులు జోడించి నమస్కరించి లోనికి దయచేయుడనెను.

చంద్రవదనుడు కొన్నిగజముల కేమిగాని తనరాజును కల సుకొనెను. లోపల నానాశాఖలకుసంబంధించిన ఖైదీలొనర్చు కా యకష్టములను కన్నులారగాంచుచు, ఆయా గుంపులయందు కిశో రుడుండెనేమోనని తేరిపారఁజూచుచు, లోనికేగుచుండెను.

కిశోరుడు కారాగారమునందు నూతనముగ నిర్మించుచున్న నొక కట్టడమువద్ద రాలుమోయుచు, చంద్రవదనున్గాంచి అపరి మితానంద భరితుడై కంటనుండి సంతోష భాష్పములు రాల, మంత్రివైపు నిశ్చేష్టుడై చూచుచు, తన నెత్తిపైనుండు బరువును కూడ మరచిపోయెను. ఆకట్టడ నిర్మాణముకడనుం డుద్యోగుల లో నొకడు కేకలిడ తుళ్ళిపడి తనపని నిర్వర్తించుచుండెను.

తనకు నేటికి విముక్తికలుగునని సంతోషించుచుండెనేకాని ఆ ప్రాంతమునుండి యీవలకొచ్చి మాటలాడుట కచ్చటియధికారి యుత్తరవు లేనందున నట్లు జరిగింప జాలడయ్యె.

చంద్రవదనుడును రూపు మారియున్నందున తన యేలికం గాంచజాలక కారాగారమునం దెల్లెడలను వెతకుచుండెను. తన

మంత్రిపవు కడగండ్లన్నియు కిశోరుడు చూచుచుండెనేగాని పాప మాత డాతనితో పల్లెత్తి మాటాడుటకుంగూడ యధికారము లే దయ్యె. యెట్టకేలకా కిశోరు డేదో బాధతో యలసటజెందిన వానివలె భూమిశొరిగి, హా చంద్రవదనా నేటికి దయవచ్చినదా! యని దీనవదనుడై పల్కినపల్కు లా మంత్రివర్యునకు ములుకులు వలెనాట తేరిపారజూచి తనరాజునకు కల్గిన కష్టమును, కన్ను లారగాంచి భరింపజాలక కంటనుండి కన్నీరు జొటజొట గార్చెను. కాని నా చంద్రవదను డప్పటికిని కిశోరునితో మాటలాడుట కవ కాశము దొరికినదికాదు.

మిట్టమధ్యాహ్నమైనది. కారాగార వాసులందరికిని తిను భండారము లొకవృక్షచ్ఛాయను తూకములిడు చుండిరి. పనిచేయు వారందరు తమతమతిండ్ల కరుగుడని కారాగారాధిపతి యాజ్ఞవచ్చి నది. వెంటనే వారివారి పనులనుండి భోజనాదుల నారగించనేగు చుండిరి.

కిశోరుడుమాత్రి మా చంద్రవదనునిం గాంచిన వాడయ్యె. ఒండొరు లొకరినొకరు హా! చంద్రవదనా యని రాజును, కిశోరా యని మంత్రియు నొక్కపెట్టుగ నాలింగనము జేసు కొనిరి.

హంసతూలికా తల్పములపై హాయిగ కాలముగడపు నీకా యీకష్టములు? సమస్తసామంతరాజులు, మంత్రులు, ప్రజలాదిగ నినుగొల్వ వింజామరలు చల్లని గాలినిచ్చుచుండ కనక శింహాసనా

సీనుడవై దివ్య భవనమునందు కొల్వుదీరియుండెడు నీకా యీ కారాగారవాసము! మణిమయ వజ్రవైఢూర్యములతో నలంకరించిన కిరీటధారివగు నీకా యీకటికిరాలను మోయుట! దుష్టులను శిక్షించు నీకా యీశిక్ష! కిశోరరాజా! యిన్నియిడుమలకు కారణము నేనేగదా? ఆనాడుదారశింహుడు నన్ను నీకడ మంత్రిగనుంచకుండినను నీవు సుఖముగ నుండియుందువేమోకదా? రాజద్రోహిని నన్ను క్షమింపుమని, యాకిశోరు నాలింగనము జేసుకొని బోరున నాచంద్రవదను డేడ్వసాగెను.

కిశోరు డాతని నోదార్చి కర్తవ్య మాలోచించవలెననియు నీవెట్లు నన్ను కనుగొన గల్గితివనియు, ఆనాడు నీవారోహించినపక్షిరాజము నిన్నెవ్విధంబున భూమికి దింపినదనియు, తదుపరి నీవనుభవించిన కష్టసుఖము లెట్టివని యడగ, మహాత్మా, సావకాశముగ నదియంతయు జెప్పగలను. ముందుకారాగారవిముక్తునిగావించుట నాకర్తవ్యమని చెప్పి తానిప్పుడే రాజును చూచెదననియు, తమరీ నాటికిట్టులే గడుపవలెనని చెప్పి దానికమ్మహానీయు నొప్పించి తిరుగ పట్టణమున బ్రవేశించెను.

తనయేలి కెవ్విధంబున నీచరసాలయందు చిక్కుబడిన దిదివరకే చరసాలలో కిశోరునిచే తెలిసికొనినందున నాలొట్టియయే తనకు దొరికినందుకెంతయు నాశ్చర్యమునొందుచు, రాజకచ్చేరిం జేరి నొకచీటిపై నేమేమియో వ్రాసి, కొన్నియణాలు బహుమానముగా నచ్చట నుండిన ద్వారపాలకున కొసంగ వాడును దాని

నా రాజపుంగవున కప్పగించిన తక్షణమే నమ్మహనీయుని త్వరిత ముగ తన్ను జూడనిమ్మని నాజ్ఞనిడ నాడట్లు గావించెను.

మంత్రిపుంగవుడగు చంద్రవదనుడా రాజునకు నమస్కరించి రాజాజ్ఞన్బడసి నొకచో కూర్చుండెను. అంతట నా రాజపరిమితా నందభరితుడై మంత్రివర్యా! సుగుణఘట్టమున కిశోరుడు క్షేమమా? యిటీవల నాతని చెలియల కెద్దియో అస్వస్థతగ నుండెనని వింటి నిప్పుడు కులాసగా నుండెనా? నూతన పట్టభద్రుడగు కిశోరుడు రాజ్యభారము వహించి చక్కగ పరిపాలించు చున్నాడా? ప్రజ లాతని పరిపాలనకు తృప్తిజెందుచున్నారా? నీవాతనికి చేయూతగ నుండిన యేలాటి లోటుపాటులుండవని నే నెరుంగుదును. అనిపల్క నాచంద్రవదనుడు మహారాజా! మా రాజన్యులవలెంగాక చక్కగ న్యాయము ననుసరించుచున్నాడు. అమ్మహనీయుడుం గాక యితర రాజు లీభూతలంబున న్యాయముగ పరిపాలించు వారు కలరా? యనినవిని రాజేంద్రుడాగ్రుడయ్యె, కండ్లనుండిఅగ్నికణము లూడిపడి నట్లుండిననుకిశోరునిమంత్రియైనందున నేమియుననజాలకఅటులైనమే మంతయధర్మ ప్రవర్తనులమాయన, నిస్సందేహముగయని ఘుంటా స్పదముగబల్కశలవిత్తురేనిసార్థకపర చెదనని యె. నేనీపట్టణమునతమ పరిపాలనావిధానమునుపరిశీలింపనరుదెంచినేడు పట్టణమందన్ని ప్రదే శములను తిలకించితిని. వానిలో ముఖ్యముగ చరసాలయందు నిర్దోషులైన మహనీయులను సహితము బంధితులజ్జేసి పరిపరివిధ ముల బాధింపుచున్నారు. వారిలో నొక్కొకరి చేత కేగి యే యే కారణముచేతమ్మిచ్చట ఖైదీలగనుంచిరని యడుగ పలువురు

పలువిధంబులఁ జెప్పుచు తమపరిపాలన యంధత్వమును వెలిబుచ్చిరి.

ప్రజలనివ్విధంబున బాధింప నేలికకు దగదు. పూర్వమొక రాజేంద్రు డివ్విధంబుననే ప్రజలను బాధింపుచు, పన్నులన్ని విధముల హెచ్చింపుచు, విధించిన ప్రకారమా నిరుపేదలగు రైతు లివ్వజాలకుండిన నష్టకష్టముల నొట్టుచుండ, ప్రజలలో నొక విష్ణు భక్తుడగు ఋషిచంద్రు డాతని చేష్టలన్గాంచి పరిపరి విధములఁ జెప్పిననాతనికి తృణమాత్రముగ నున్నందున నాజడదాగి కోపించి దుర్మార్గుడా! నీవివ్విధంబున నీసరిసోదరులను బాధింపు చుంటివి. ముందు జన్మమున నీవీ పృథ్వియందు భీమాకంపెనీ కేజంటువై (Insurance Agent) పుట్టుమని శపించె. కావున తమరట్లు గావింప దగదు. న్యాయము నాలోచింప కేదియుఁ జేయవలదు.

మా కిశోరచక్రవర్తి రాజ్యములో ధర్మము నాలుగు పాదములనడచుచున్నది. దానంజేసి సమస్తప్రజలు వేనోళ్ళశ్లాఘించుకొనుచు రాజును దైవమువలె పూజింపుచున్నారు. యిట్టియధర్మముమారాజ్యముననే కాదు, యేరాజ్యమున నుండబోదు. దేవర వారాజ్ఞయయ్యెనేని కన్నులార గాంచవచ్చును. చరసాలయందు చాలలోటుపాటులు కలవని పెక్కు రాజ పరిపాలనా లోభములఁ జెప్పనారాజు చిన్నవోయిన వానివలె గాన్పట్టుచు, చంద్రవదనా! అట్టి లోభములున్న సవరించు కొందును. బుద్ధిపూర్వకముగనే నేమియు దుర్మార్గ మవలంభింప నైతిననియు,నాలోభములను జెప్పుమనియు, బుద్ధిశాలియగు నాచంద్రవదనుని బ్రతిమాల జొచ్చెను.

అంతట చంద్రవదనుడు, మహారాజా! నేనీపట్టణము ప్రవే

శించినదాది ముఖ్యముగ చరసాలం గాంచితిని. అందొక్కబంధితుడు తానునిర్దోషినని తనచరిత్రయంతయు నాకుఁజెప్పుకొనెను. మరియు స్వామీ నిండుదుఃఖములో మునిగియున్న నాసత్యమునుపరిపాలనా శాఖ కెఱింగించినన్ను విముక్తునిగావింపుమని వేడుకొనియె. వానిమాట లనుబట్టి చూడ నాకునుజాలిగొల్పి యీపట్టణ పరిపాలన యింతటి యంధత్వముననున్నదిగదాయని గ్రహించి యికలోనికేగ జాలక బుద్ధిచలించి యీవల కరుదెంచితిననియు, తమరీ తక్షణము శల విప్పించిన నాతని నిచ్చటికి పిలపించి నిర్దోషియని నేనే నిరూపింప గలననియు, రాయిగుద్దినట్లాసుగుణ ఘట్టమంత్రిబల్క నాతని వద్ద యాఖైదీ నెంబరును గైకొని యొక శేవకుని రావించి నొక చీటిపై నేమేమియో వ్రాసినీవుతక్షణమేదీనినిచరసాలాధికార్కి కొసం గుమన నాతడు నొక రెప్పపాటులో నటుల గావించెను.

చరసాలాధి కారియు రాజుగారి యాజ్ఞ చొప్పున నిమేషమాత్రమునబంధితుడగు కిశోరశింహునిరాజకచ్చేరియందుహాజరుపరుప, నింతలోనారాజు మంత్రిని రావించి అనాడా కిశోరుని బంధింప జేసిన వర్తకులను గూడనచ్చటికి పిలిపించి విచారణ ప్రారంభించుటకు సర్వాధికారము చంద్రవదనునకివ్వ నాసుగుణఘట్ట ప్రధాని కిశోరునిగాంచి, నీవీవర్తకుల యొంటెనానాడు దొంగిలించితివా యని యడుగ, లేదనెను.

లేనిచో వారియొంటె యిప్పుడెచ్చటనున్నదో చెప్పగలవా యని యడుగ నేను చెప్పజాలననెను. అటులైన నీవాయొంటె నెట్లు గుర్తింపగలిగితివో రాజుగారి కెలాటి యనుమానమును లేక

పూసగుచ్చినట్లు చెప్పకొనుము. లోటుపాటులున్న నేను సవరింతునన, నావర్తకులు అయ్యా యింటు లోటుపాటులేమున్నవి. మా లొట్టియ నీతడే అపహరించెను. దాని కేలాటి సందియమును లేదు. యీపాటి కప్పడే నదియు మాపై బెంగచే కృసించి చనిపోయి యుండును. యీధౌర్భాగ్యుడు దానిని తనయాలుబిడ్డల కప్పగించి వచ్చియే మాకంటబడి యుండవచ్చునన, నా చంద్రవదనుడు వణు జులారా మీరటులనతగదు. మీయొంటె నపహరించిన వాడైన తిరుగ దానికుండుకొన్న గుర్తులన్నియుఁ జెప్ప నీతనికవుసరము లేదు. పోనిం డీతడేమిచెప్పనో చూతమన నాకిశోరు డివ్విధంబునఁ జెప్ప దొడంగెను.

మహారాజా! సభాసదులారా!! నేను వీరియొంటె నెన్నడును కన్నులార గాంచియెరుంగను. అప్పడు నేను నొకమార్గస్థుడను. నేను నామార్గమున పోవుచుండగా మార్గమున నొకయొంటె పోయినట్లును, అది పోవుమార్గమున మూడుకాళ్ళయొక్క జాడ లను కనబడుచున్నందున దానికొక కాలుకుంటిదని గ్రహించి యీ వర్తకులతో దానికొక కాలు కుంటిగదాయని యడిగితిననెను.

అప్పడావర్తకులలో అగ్రజుడు లేచి అటులైన కాలిజాడగనుక అతిసులభముగ కనుగొనిచెప్పితివంటివి. కాని దానిమూపుపై నొక వైపు బెల్లమును, మరియొకవైపు గోధుమ లుండలేదాయని నీవు ప్రశ్నించితివి. అది నీకెట్లు తెలియునన నాకిశోరుడయ్యా, అది నడ చిన మార్గమంతయు నొకవైపున చీమలు, వేరొకవైపు ఈగలు, బారులు తీరియున్నందున నేనట్లర్థముఁ జేసుకొని యంటిననెను.

అప్పుడు చరసాలాధికారి (Jail Superintendant) లేచి ఆనాడు నీవు చెప్పుటలో ఆయొంటె కుడికన్ను గ్రుడ్డిదని చెప్పుటకు నీవొప్పుకొని యుండలేదా! యన, ఔను అది పోవు మార్గమునందు కుడివైపున ఉక్కని చిగురుటాకులన్నియు వదలి, వక్కయెడమ వైపుననే చెట్లయాకులనుదినుచూ వెళ్ళినందున దానికుడికన్ను గ్రుడ్డిదని నేనెరుంగగల్గితినని నెను.

అటులైన మాయొంటెకు ముందు రెండుపండ్లూడియుండలేదా యని నీవానాడు మాకు చెప్పియుండలేదాయన, ఔననెను. అప్పుడు ప్రభుత్వన్యాయవాది (Public Prosecutor) లేచి పైసంగతులు మహారాజుగారంగీకరించిన నంగీకరింపవచ్చును గాని, దానికి రెండు పండ్లూడినట్లుగుర్తుగజెప్పిన యీమాటనుబట్టిచూడ నాలొట్టియ నీ తడే అపహరించెనని వేరుగచెప్పకుండగనే అందరము తెలుసుకొన గలమన నాచంద్రవదను డయ్యా, దీనికాతడేమిచెప్పునోచూతమన నాబంధితుడు, స్వామీ! అదియామార్గమునబోవుచూచిగిర్చియున్న చెట్లయొక్క ఆకులను కొరకినట్లును, దాని పలువరుసయందు రెండు పండ్లు తక్కువగా యున్నట్లు పత్రములపై గాట్లు కనబడినందున దానికి ముందు రెండుపండ్లూడినట్లు నేనుగ్రహించి వారితో చెప్పి తినన భూపాలుడా మాటల కచ్చెరువొందసాగెను.

అప్పుడు చంద్రవదనుడు లేచి యీకేసునందు న్యాయమును చెప్ప నేర్పరుపబడిన అయిదుగురు పెద్దలనుగాంచి మీరీతని మాట లన్నియు విన్నారుకదా? యీవ్యక్తి దోషియైనట్లు నాకెక్కడను కాన్పింపదు. మరియు మీరు గ్రహించవలశిన ముఖ్యవిషయ మే మనగా, తానే యాలొట్టియను తస్కరించినచో తిరుగవచ్చి వారి

కీమాటలనుఁ జెప్పుట కెంతటి తెలివిమాలినవాఁడైనను సాహసించు
నా? యీవక్క యాధారమాత్రనిని విముక్తిచేయగలదు. కేయీత
డునిర్దోషి. యింతకన్నను తమతో నేనేమియు చెప్పదలంచ లేదని
కూర్చుండెను.

ప్రభుత్వన్యాయవాది లేచి అయ్యలారా! యింతమాత్రము
ననే యీతడు నిర్దోషియని మనము చెప్పుటకు నీలులేదు. మాస
మురోజులనుండి చెరసాలలోనుండి యీవిధంబునపన్నాగముపన్ని
చెప్పుటయేకాని వా స్తవముగా యీత డా లొట్టియనుదొంగిలించి
యేయుండును. లేనిచో నిర్మానుష్యమైన ఆఅడవిమధ్యంబున యెవ్వ
రిట్టి సాహసమున కొడిగట్టగలరు? అదియునుంగాక యీవర్తకులు
గొప్ప ధనవంతులైన సమాచారము మీకును తెలుసును. అట్టిధని
కులింతటి యబద్ధముచెప్పుట కేమియగత్యమును లేదు. వీరును సాలు
నకు కొన్ని వేలరూక లాదాయముపన్ను చెల్లించువారు. కనుక
మీరు యీవిషయము బాగా నాలోచింపతగినదని చెప్పెను.

అంతట చంద్రవదనుడు లేచి రాజుగారి యాజ్ఞనొందసి, మహా
శయులారా, యెన్నివేలుఆదాయపుపన్ను (Incometax)చెల్లించి
నను యెంతటిసంపన్నపరులైనను, అనృతమునకును, ధనమునకును,
మర్యాదకును యేలాటిసంబంధము లేదు. యెన్నియబద్ధములాడనిది
ధనవంతులుకారు. సత్యముకొరకు ధనమంతయు కోల్పోయినవారు
పెక్కండ్రుగలరు. మీరు దీర్ఘముగ నాలోచించి న్యాయమును
గమనింతురని నాప్రార్థనయనెను.

మహారాజు (Judge in-charge) కూడా కేసులోని
పట్టుదల మాటలన్నియు వినిపించిన తరువాత పట్టణపెద్దలైదు

గురును (Assessors) వారిలో వారేదియో గుసగుసలాడు కొనుచు నొక్కపావుగంట గడపి యాపిమ్మట నొక్కరొకరు లేచి మహారాజా! యీబంధితుడు కేవలము నిర్దోషియని చెప్పిరి.

మహారాజును వారి యభిప్రాయము నందేకభవించి యీ తడు నిర్దోషియని నిర్ధారణచేసి కేసుకొట్టివేసెను.

వర్తకుల ముఖములు వెలవెల బోయెను. ప్రభుత్వ న్యాయ వాది నేలవంక తలవంచి చూచుచుండెను. చరసాలాధికారి తన లెక్కలనుండి యీ వ్యక్తిపేరును తీసివైచుకొనెను.

అప్పుడు సభాసదులందరును లేచిపోవ నుద్యుక్తులైయుండ సుగుణఘట్ట ప్రధానోత్తముడగు చంద్రవదనుడు లేచి సభాసదు లారా! యీనాకడసారి పల్కులాలించి వెళ్ళవచ్చునని జనసమూ హ మంతయు నిశ్శబ్ధముగ కూర్చుండ నిట్లు చెప్పదొడంగెను.

మహారాజా! సభ్యులారా!! యీవర్తకుల యొంటె తమ యొద్ద యుంచుకొనియే అబద్ద మాడలేదు. వీరిలొట్టియ పోయిన మాట సత్యమేకాని, యీవ్యక్తిదానిని దొంగిలించి యుండలేదు. అదినాకే దొరికినది. దాని నీ పట్టణమునకు తెచ్చి విచారింపగా యీ పరిస్థితులన్నియు తెలియవచ్చినవని జెప్పుచు నంతకుపూర్వ మే తెచ్చియుంచిన నాలొట్టియ నచ్చటికి తెప్పించి వర్తకులకొసంగి మహారాజా! యీబంధితుడు సుగుణఘట్ట పురాధీశుడు, యీ మహనీయుడే కిశోరశింహుడు, నేనమ్మహనీయుని మంత్రిని. మీ రిరువురును మేనత్త మేనమామ బిడ్డలని దెల్ప విజయరాజ పురా ధీశ్వరుడు తన సింహాసనము నాతురతాశ్చర్యచింతాక్రాంతుడై డిగ్గి

కిశోరు నాలింగనముఁ జేసుకొని యిట్టి పనిజేసినందు కెంతయు వగచి తన్ను క్షమింపుమని కొనకాళ్ళంటి విడువకుండెను. సభాసదు లందరాశ్చర్యముతో మహారాజునుఁ జూచుచు గొల్లుమనిరి. తక్షణమే ప్రజలందరు రాజకచ్చేరిఁ వదలివెళ్ళవలెనని యాజ్ఞ యయ్యెను. వెంటనే ప్రజలందరట్లుగావించిరి. కోశాధికారి యీకేసు నందు న్యాయము జెప్పిన పట్టణవాసు లైదుగురికి భత్యాఖర్చుల నిచ్చి (Travelling allowance) సాగనంపెను. రారాజు కిశో రుని, చంద్రవదనుని లోనికిఁగొంపోయెను. జరిగినదంతయు, చంద్ర వదనుడు మహారాజునకెరింగించెను. ఆనాఁడుమంత్రిని చరసాలను ప్రవేశింపజేసిన ఆస్థానోద్యోగి చంద్రవదనుని కొనియాడెను. వర్తకులకామృగము నొసంగబడెను. దానిని కాపాడి వారి కొప్ప గించిన నాటికూలివాని కావర్తకులచే కొన్నిరూకలనిప్పింపబడెను.

కిశోరుడు పడిన కష్టములు, చంద్రవదనుని అవస్థలన్నియు రాజువిని చింతాక్రాంతుడై తన్నుక్షమింపుమని వారిరువురను వేడ, వారందులకిందుతమకుఁజేసిన దేమియును లేదనియు, మాఖర్మ కెవ్వరు కర్తలనియు, ముందు మేమిచ్చట యేమాత్రి మాలశింప వీలుకాదనియు, జడదారి శాపవచనములతిశీఘ్రముగ నమలున కొచ్చుచున్నవనియు, తామిప్పుడు నాలుగురోజులలో పండరిచేరక పోయిన ప్రయోజన మావంతయు లేదనియు, తమకేదేని త్వరలో నచ్చటికిచేర సదుపాయము నేర్పరుపవలెననికోర నాపట్టణయేలిక తక్షణమే వడిగల రెండశ్వములను, కొంతధనము నొసంగి, తిరుగ తాము స్వస్థానమున కేగులోపల వకపర్యాయము దర్శన మిప్పింపు

మని కిశోరునడుగ నావిషయము చెప్పజాలమనియు, వీలునుబట్టి అట్లుగావించెదమన నట్టులేనని నా భూనాథుడు మార్గమునుఁదెల్ప నొక్కనిని వారివెంట నశ్వరూఢునిఁగావించి పంప అచ్చటికనతి దూరమునందుండు పండరిపురమునకు మరునాడు సాయంసమయ మునకే చేరుకొనిరి.

తమ్ము వెన్నంటిన యాశ్వికుడు కిశోరునిచే నొసంగబడిన లేఖనంది వారియనుజ్ఞనంబడశి అశ్వత్రియముతో వెనుకకు మరలెను.

పుండరీకాక్షుకుండు పండరిచేరిన నాకిశోర చంద్రివదనులిరు వురు నాడొక ధర్మశాలయందు బసజేసిరి. నేర్పరియగు నాచంద్ర వదను డప్పుడే కొన్ని రొట్టియ లొక్కనిమేషమాత్రిమున తయారు పరచి నాటికిభుజించి నొకచో హాయిగ భుక్తాయాసముల నీర్చు కొనుచు, సుగుణఘట్ట పురాధీశ్వరుండగు కిశోరశింహుడు తన మంత్రివర్యునిఁగాంచి, మిత్రిమా, నాడు నీవుచెప్పిన మాటలాశ్చ ర్యముతో కూడుకొన్న సందేహము నన్ను నేటికిని బాధింపుచున్నది. అంతటి దీర్ఘకాయముగల మనుజు లుందురా? అగుగాక, నిన్నా విధంబున జేబునందుంచ గలరా? చంటిబిడ్డ సహితము నిన్ను పంజరమునందు నిటునటు ద్రిప్పగల్గునా? యని ప్రిశ్నింప, నా చంద్రివదనుడు పక్కుననవ్వి, రాజేంద్రా! మీరటులనదగదు. మీతో నేననృత మాడగలనా! యియ్యదిసత్యము. అంతదీర్ఘకా యముగల పక్షులుండ తగిన మనుజులుండుటాశ్చర్యమా? మీరె న్నడును రామాయణమునుచేదువలేదా? అందు జాంబవంతాదిమ హానీయులు పర్వతములతో బంతులాడలేదా? నాయీపల్కులు నిక్కవములని యానరపాలుని సందియముఁదీర్చెను.

మరునాడుదయమున వారిరువురు నిత్యకృత్యములను దీర్చు కొని సమస్తపాపవినాశినియగు చంద్రభాగీ నదియందు జలకమా డం బోయిరి. ఆనదీతీరమందును, నది మధ్యభాగమునందు నుండు కట్టడములను, నదిలో వేనకువేలు చిన్నచిన్న నావలయందు నటు నిటుతిరుగు యాత్రికులను, వారి నాశ్రయించి పీడింపుచుండిన పం డారులను, విశాలముగ మెలమెల్లగ ప్రవహించు నాచల్లని జలము లను, అందుండు జనులనుజూచుచు కిశోరచంద్రవదనులపరిమి తానందము నొందుచు, తాము జలకమాడి పుండరీకాక్షుని ధ్యా నింపుచు పాండురంగ మందిరమునందు ప్రవేశింప ముఖద్వారము కడ కరిగిరి.

ఆఆలయముఖద్వారమునకిరువైపులనుయాత్రికులుతండోప తండంబులుగ నచ్చటనుండు అంగడులయందు పూలమాలలను, కుంకుమయు కొని గుడిలోప్రవేశింపుచుండ తాముయునట్లుగావించి ఆలయ ప్రవేశమైరి.

అచ్చటనిజభక్తులలోకొందరురంగనిమహిమ నెంచుచు పురా ణముఁజెప్పువారును, కొందరేకీభవించి భక్తిపూరితమగు కీర్తనలు పాడువారును, మరికొందరన్యదేశములనుండి రంగని దర్శింపవచ్చిన వారికి పండరినాథుని మహిమ తెలుపువారును, కొందరల్లదే విఠ లేశ్వరుని దివ్యమంగళ విగ్రహముని జూపువారును, భక్తులుభగ వంతుని ధ్యానింపుచుండ వేనకువేలు ప్రజలమ్మహానీయుల పాద ములన్బడి మ్రొక్కువారును, మరికొందరు భక్తుల మెడలునిండ పూలహారములిడి నమస్కరింపువారును వేరొకవైపున పండారులు

దర్శింప వచ్చిననాతితో రూకలకొరకు జగడమాడుటయు, కన్ను లార గాంచి అపరిమితానంద భరితులై యింకను ఆలయములోనికి ప్రవేశించిచూడ, గర్భగుడియందు భక్తులు స్వయముగ రంగని వద్ద కేగుచు పాదములపై బడువారును, రంగని విగ్రహమును కౌగలించుకొనువారును, మరికొందరావిగ్రహముచుట్టు ప్రదక్షిణ జేయువారిం జూచుచు సంతోష మంతకంతకు హెచ్చ కన్నుల పండువుగ నాయాలయమంతయు వెర్రిచూపు జూచుచుండ చంద్రవదనుడాకిశోరునిగాంచి మహారాజా! కాంచితే! యిదియే గర్భగుడి. అల్లదియే పాండురంగని దివ్యమంగళ విగ్రహము. తాను నిండుగ పూలమాలలచే నలంకరింపబడి, మణిమయ వజ్రవైఢూర్యఖచితంబగు కిరీటమలంకరించుకొని, వల్లెవాటుగ నొకచెల్లానుమేనియందుంచుకొని దాసులకు దాసుడై నిలువంబడి దర్శనమిచ్చుచున్నాడు. కాంచితే! యాతడే పాండురంగడన కిశోరుడు, మిత్రమా! పుండరీకాక్షుడు తానొక్కడిచ్చట నున్నాడేమి? అర్ధాంగియగు రుక్మిణీదేవి యెచ్చటనన, కిశోరా! అదియుంగూడ విచారింతమన నింతలో నొక పండారిబ్రాహ్మణుండరుదెంచి, అయ్యా విఠల్ నాథుని జూచి మోక్షముబొందుడు. అల్లదేపాండురంగడు, రుక్మిణీఅమ్మవారుండు ఆలయమదిగో చూడుడు, బీదబ్రాహ్మణున కేదేని నేడిప్పింపుడనినదితడవుగ కిశోరుడొకరూక నాతనికిచ్చెను.

అచ్చటనుండు పండారులదిగాంచి కిశోరచంద్రవదనులచుట్టు మాకుకూడ తమరేదేని యిమ్మని మరాఠిభాషలో నడుగుచుండ చంద్రవదనుడు కిశోరునిగాంచి మహాప్రభూ! శ్రీజగన్నాధమునం

దును, పండరిపురమునందును, పండారుల గోల యధికమని మా నాన్నగారు చెప్పుచుండెడివారు. వీరినిచ్చట భగవంతుడు సృష్టించెగాబోలు. వేనవేలు యాత్రికుల నివ్విధంబుననే బాధింపుచుందురు. దివ్యప్రదేశమగు తిరుపతిలో వేంకటాద్రియందు కోతులు ప్రజల నెవ్విధంబున బాధింపుచుండెడివో నట్టులే యీ పండారులు యాత్రికులను బాధింపు చున్నారు. కానియిప్డు తలకొక పైసనొసంగుమన రాజుచిరునవ్వుతో నట్లు గావింపుచు, చంద్రవదనా! ఆనాడు ధనదాన మొసంగ కూడదని నుడివినది నీవేనా, యనిపల్క మంత్రివర్యుండు భూమివంక జూచుచు వెలవెలంబోయెను.

అప్పుడా కిశోరచక్రవర్తి మంత్రివర్యుని యుదంతం బెరింగి దాసిన్గప్పిపుచ్చ చంద్రవదనా! ఆనాడుమనలను శపించిన మహానీయుని గడవుదినము రేపటితో ముగియునుగదా, ముందు మనమా దివ్యపురుషుండు తా వెరింగిననేగాని మనస్సునిలకడ జెందదు. త్వరితముగ మనమచ్చటికేగవలయునన చంద్రవదనుడుత్రుళ్లిపడి, రాజా అవునట్లు గావించుటత్యవసరమని రంగనిధ్యానించి పూలమాలాలంకారుని గావించి మ్రొక్కి, వెంటనే ప్రక్కగుడియందుండు అన్నవారిని దర్శించి కుంకుమసమర్పించి ఆయావరణలో తక్కిన చిన్న చిన్న గుడులయందుండు శిద్ధులను దర్శించి వేవేగ నాయాలయమున్వదలివచ్చుచు, యిరుప్రక్కల యంగడులయందుండు రంగని దివ్యమంగళవిగ్రహామున్గనిపించు ఛాయాపఠములను, తులశిమాలలను, భజనచేయు చిటికెలు, తాళములు మొదలుగాగల దైవసంబంధ

మగు వస్తువులను విక్రయించు వర్తకులను, వానినిగొనుటకరుదెంచిన యాత్రికులను, యెదురుగ కాన్పించు చంద్రభాగానదిని, దాని యందుండు గుడులను, జలకమాడు యాత్రికులను, చిన్ననావల యందు ప్రయాణముజేయు ప్రజలను కన్నులపండువుగ జూచుచు, పండరిమహిమ నెక్కువిధంబుల కొనియాడుచు పోవుచుండ నింతలో నొక మహనీయుడా రాజమంత్రుల నెదుర్కొని పుణ్యాత్ములారా! జీర్ణవస్త్రిడను యేదేని సహాయ్యపమదురాయని యడిగిన దితడవుగ కిశోరరాజు వానినొక యంగడికిఁ గొంపోయి తన కిచ్ఛవచ్చిన కొన్నివస్త్రముల నిప్పింప నావృద్ధుడు కడుంగడుసంతసించి పెక్కువిధంబుల నాకిశోరునిమంత్రి సహితముగ గొనియాడ నా చంద్రవదనుడు, అయ్యా! యీపట్టణమందు ప్రతిసంవత్సరము పాండురంగని సప్తాహమెవ్వరో మహనీయు డొనర్చునట వారిని తమరెరుంగుదురా యని మరాఠిభాషలో యడుగ, బాబూ! వారి నెరుంగని వ్యక్తిగలడా? రేపటినుండియేకదా సప్తాహము ప్రారంభమగుట, అట్టి మహోత్సవములు రేపటినుండి యిచ్చటికొక్కమైలు దూరమున నున్న గోపాలపురమున జరుగును. అమ్మహనీయుని నామధేయ మదియేమో నాకు తెలియదుగాని ప్రస్తుతమాయనను విఠల్‌దాసందురు. వారిప్పుడు అచ్చటజరుగబోవు సప్తాహమునకరుదెంచు యాత్రికుల సౌకర్యార్థమై తగు యేర్పాటులను జేయించుచున్నారు. మీ రమ్మహనీయుని గోపాలపురమున గాంచ గలరని గోపాలపురమున కరుగుమార్గమును జూపి యావృద్ధుడు వారియనుమతిన్బడసి చనియెను.

తా మావృద్ధుని పల్కులకెంతయు సంతసించి వెంటనే తా ము బసచేసిన ధర్మశాలకరిగి భోజన తాంబూలాదుల నారగించి యించుకసేపచ్చటనే భుక్తాయాసము దీరశయనించిరి.

మణికంధరా! యికవీరిని పండరిపురమున పుండరీకాక్షుని దర్శింపంజేసితిమి. సుగుణఘట్టమున సుగుణవతీ, సత్యవాణులు, యిందిరసహితముగ నెట్లున్నారో చూతమని, నావిజయవర్మబల్కు అవునుస్వామీ! అన్నట్లాపతివ్రతా శిరోమణులెట్లున్నారో కదా? ఉదారశింహుడు ప్రజలమనస్సు రంజింపఁజేయుచున్నాడా? యన నావిజయుండివ్విధంబున చెప్పఁదొడంగెను.

సుగుణఘట్ట పురాధీశుండగు కిశోరుడాతని రాజ్యమువదలిన దాదిగ నుదారశింహుడు చక్కగ రాజ్యమును పాలింపుచు ప్రజలకత్యంత సౌఖ్యములనలుగ జేయుచు రాజకుటుంబమున కేలాటి లోటు పాటులు లేకుండ సవరింపుచు కిశోరచంద్రవదనుల రాకకెదురు జూచుచు దినములను లెక్కిడుచుండెను.

తనపరిపాలనా విధానమునందేమైన పొరపాటులున్నవేమో యనియు, అటులుండెనేని కిశోరుడు తెలుసుకొని పశ్చాత్తాపపడు ననియు, ప్రజలు తన్ను దూరుదురనియు, భీతిజెందినవాడై చారుల వలన తనలోపము లేమైన ప్రజలు చెప్పుకొనుచుండి రేమోయని విచారించి సవరణజేసుకొనుచు, బహుచక్కగ నేలుచుండెను.

అంతఃపురమున రాజపత్ని తనభర్తరాకకై యెదురుజూచు చు, వారికేదేని యాపద సంభయించి యుండదుగదా యని తర్కిం చుకొనుచు, యిందిరవివాహ విషయముకూడా తలపెట్టుట కవకాశ

ము లేకుండ హఠాత్తుగా యిట్లు జరిగినందుకు చింతించుచు, తన భర్తదివ్యక్షేత్రంబగు పండరిపురము జూడ నేగినందుకు సంతసింపుచు, యిందిర సహితముగ మంత్రిభార్యతో నాలోచింపుచుండెను.

మధ్యమధ్య నుదారశింహుడంతఃపురమునందుండు యిందిర, సుగుణవతీ సత్యవాణుల నూరడింపుచు, బిడ్డలారా! కిశోరచంద్రవదనులరుదెంచుట కింక నెన్ని నాళ్లోజరుగదు. వారును యీపాటికి పండరినుండి మరలియుందురని ధైర్యమును జెప్పుచుండెను.

ప్రజలెల్లరును తమయేలికరాక కెదురుజూచుచుండిరి. కొందరామహనీయున కెట్టియాపదలు సంభవింపకుండ నిల్లుజేరుట దుర్లభమనియు, అదియంతయు మహారాణిగారి పూర్వజన్మసుకృతమనియు, పలువురు పలు తెరంగులఁజెప్పుకొనుచుండిరి.

యివ్విధంబున సుగుణఘట్ట ప్రజలు, రాజ, మంత్రికుటుంబములు, కిశోర చంద్రవదనుల రాక కెదురుజూచుచు తహతహలాడుచుండ నొకనాటి సాయంసమయమున నొకయాశ్వికుడారాజ కచ్చేరి కడకరుదెంచి వుదారశింహ మహారాజుగారెచ్చట నున్నారని ప్రశ్నింప నచ్చటనుండు ద్వారపాలకు డాతురతతో తమదేయూరు? వారితో నేమిపనియని యడుగ, కిశోరచక్రవర్తిగా రొక కమ్మవ్రాశి వారికిమ్మనియె, ననిపల్క రాజకచ్చేయందు నిండుకొల్వునందుండుదారశింహు డాతురతతో నరుదెంచి దానినందుకొనెను.

దానిని విప్పిచూడ తామీపుత్తరమువ్రాసిననాడే పండరిపురముచేరితిమనియు, యింతటియాలశ్యమునకు కారణము మేమచ్చ

టికి వచ్చినతదుపరి నెరింగించెదమనియు, తాముక్షేమముగ చేరినం దుకు సంతసమును వెలిబుచ్చుచున్నామనియు, యీ కమ్మను తమరు తక్షణమే, సుగుణవతీ, సత్యవాణులకు చూపవలెననియు, చెల్లెలు యిందిరసదా జ్ఞప్తికివచ్చు చున్నదనియు, అతిస్వల్పకాల మున, నాప్రజలను చూడగలననియు వ్రాయబడియుండెను.

ఉదారు డాశ్చర్యానంద భరితుడై తక్షణమే నాకమ్మలోని సంగతులజెప్ప స్వయముగనాకమ్మను మహారాణిగారి కొసంగ నంతఃపురమంతయు నొక్కపరి సంతోష సాగరమున మునింగెను. అప్పుడే యీవార్తపట్టణ మందెల్లెడలను తెలిసిపోయెను.

అప్పుడుదారశింహుడా యాశ్వికునికడ కరుదెంచినీకుమహా రాజుగారెచ్చట గాన్పించిరనియడుగ, కిశోరచక్రవర్తి చెప్పిన చో ప్పున జరిగినదంతయు మాటుపరిచి, మహాప్రభూ, వారుపండరిపుర ముచేరగనే అచ్చట గుర్రపుస్వారి చేయువారిలో నిపుణులు తమ్ము దర్శింపుమని పట్టణమందు చాటనంపిరి. అంతట నేనమ్మహానీయులను దర్శింప వారొక కమ్మవ్రాసి సుగుణఘట్టమును ప్రస్తుతమేలుచూ డినతమకీయుత్తర మివ్వవలెనని చెప్పుచు,యిచ్చటికరుదెంచు మార్గ ముజెప్పి పంపిరి. యిక నాకు శెలవిప్పింతురా యన వానికుచిత మర్యాకలజేయించి కమ్మలో వ్రాసినప్రకారము నూరు వరహా లాతనికిచ్చి పంపివైచెను.

తిరుగజవాబు వ్రాయ నుంకించు చుండిన నుదారశింహున కాభటుడు, అయ్యా, వారు మరునాడే పండరి వీడెదమనియు, తమ జవాబు చేరువరకు నచ్చట నుండమనిరని చెప్పినందున నట్లు

జరిగింపడమ్యె.

సుగుణఘట్టమున ఆతురత తగ్గినది. గోకులయందు కిశోర చంద్రవదనుల గుఱ్ఱములు చక్కగ పోషింపబడుచున్నవి. నాడు గుఱ్ఱముల నారోహించియుండిన ధనలక్ష్మిని గోకులలో భద్రపరుపబడెను.

పండరిపురమునందు సుగుణఘట్ట పురాధీశుండగు కిశోరుడు మంత్రిసహితముగ గోపాలపురము చేరుకొనెను. యీపాటికప్పుడే తమతోపాటు పండరిమార్గమునుజూపవచ్చిన యాశ్వికుడు మిగిలిన రెండశ్వములను రాజున కప్పగించి సుగుణఘట్టమునకు చేరి మన క్షేమములు దెల్పియుండునని వారూహించిరి. ఎదుటనట్టహాసముగ నలంకరింపబడిన విశాలమగు పాకాలు గాన్పట్టు చున్నవి. ఆనాడు సుగుణఘట్టమున కరుదెంచిన జడదారి యాత్రికులకు తగు వసతు లేర్పాటు చేయించుచుండుట కిశోరచంద్రవదనులు గాంచి శరీరము పులుకరింప నొకరినొకరు అమ్మహనీయుడేకదా తమనిచ్చటికిరప్పింప జేసినదని జెప్పుకొనుచు దృఢపరచుకొని సమీపమున కరుదెంచి యిరువురొక్క పర్యాయముగ నావిఠల్ దాసు పాదములన్బడిమొ్రక్కిరి. చిరునవ్వుతో వారిని లేవనెత్తి,బిడ్డలారా!తమరెవ్వరని యడుగ సుగుణఘట్ట పురాధీశ్వరుండు మంత్రివైపు వెలవెలబోయి చూడ దొడంగెను.

అప్పుడా మహనీయుడు దివ్యదృష్టితో ఆకసమువంక తేరి పారజూచి జ్ఞప్తికిదెచ్చుకొని మార్గమునందు వారుపడిన కష్టము లన్నియు తెలుసుకొనినవాడై వారిరువుర నొక్క పర్యాయము

కౌగలించుకొని, నాయనలారా యెంతకష్టపడితిరి. అమ్మయ్యో! పుండరీకాక్షుని కరుణ లేకుండిన మీరీపాటికి భూలోకము విడచి యుందురుగదా? యని, యెదపై చేతులిడుకొని నిట్టూర్పువిడచి మీ కష్టములకంతయు నేనేగదా కారణమని విచారింపుచుండ కిశోర చంద్రవదనులు వారినివారించి, తండ్రీ! తమదయ లేకుండిన మేము పండరిక్షేత్రము చూడగలమా? మీ రట్లు విచారింప తగదని నూరడింపబడిన నావిఠల్ దాస్ వారికుచిత మర్యాదల నొనర్చితగు వసతు లేర్పాటు జేయించెను.

వెండియు నాకిశోరశింహ చంద్రవదనుల కా గోపాలపుర మునగల, సక్కు, నామదేవ్, కృష్ణమందిరములు, సక్కు తాను పడినకష్టములను జూపు వివిధరకముల పనిముట్లు మొదలుగాగల సమస్త ముఖ్యవిషయములను స్వయముగజూపించి నాటిసాయం సమయమునకు తిరుగ వారికుచిత మర్యాద లపరిమితముగ జరిపెను.

మరునాడుదయమున తిరుగపండరిపురమున కా జడదారి కిశోరచంద్రవదనులతో పడవయందు ప్రయాణము గోపాలపురము నుండి సాగించి, మార్గమధ్యమున నదిలోను, నదికీవల నావలవైపుల నుండు ముఖ్యప్రదేశములను జూపించుచు, పుండరీకాక్ష ఆలయ మునకెదురుగ నుండు రేవులో వారుముగ్గురు దిగిరి.

అందువారిచే స్నానముజేయించి తానునట్లుగావించి పీతాం బరధారులై తిరుగనొక చిన్న నావయందు నాచంద్రభాగీనది యం దుండుభక్తులసమాధులను వానిపైనమర్చిన కట్టడములను తిలకింపు జేసి పుండరీకాక్షుని దర్శించిరి.

ఆలయమునందు ప్రతిభాగము నపరిమితానందముతో వారికి జూపించెను. గుడియందీమహనీయుడగు విఠల్ దాస్ ప్రవేశింపగనే వేనకు వేలుప్రజలువారికి స్వాగతమొసంగి నిజభక్తుడైనందున పాదములంబడి మ్రొక్కదొడంగిరి. వారిమన్ననలంబడసి గర్భగుడిప్రవేశించి, కిశోరచంద్రవదనులను రంగనాలింగనము జేసుకొనునట్లొనర్చెను.

ప్రీతితలకు కొన్నియణాలు పుచ్చుకొనని దట్లుజేయుటకువలను గాదనెడి అర్చకులు పాపమప్పుడేమియు మాట్లాడుటకవకాశము లేకపోయినది. నిన్నటివలె పండారులీకిశోరు నాశ్రయింపరారైరి.

యిట్టిమహానందమున కిశోరరాజు విఠల్ దాస్ గారిని గాంచి స్వామీ! విఠలేశ్వరునికి నలుప్రక్కల యినుపగొలుసులు కట్టబడియుండుట కేమికారణమని యడుగ, బిడ్డా? యాత్రికు లొక్కొకపరితండోప తండంబులుగ నరుదెంచినప్పుడు యిట్టిగొలుసులుకూడా తెగిపోవచ్చునో యనునట్లుండు ననెను.

స్వామీ! తమరిట్టి దివ్యస్థళంబగు పండరిపురమందు గదా, సప్తాహముచేయవలశినది. గోపాలపురమున నేల జరిగింపు చుంటిరని చంద్రవదనుడడుగ, నాయనా! నీవనునదినిజమే, కాని పాండురంగని కోరికమాత్రము గోపాలపురమున జరిగింపమని, తండ్రీ యింతకన్న మీామిక్కిలీ విషయమై నన్ను ప్రశ్నింపవలదనమిన్నకుండెను.

యివ్విధంబున నాటిపదిగంటలవరకుపండరిపురమహాత్మ్యం

బును స్వయముగజూపుచు, విశదీకరింపుచు, విఠల్‌దాస్ మిట్ట మధ్యాహ్నమునకు కిశోర చంద్రవదనులతో గోపాలపురము జేరెను.

నాటినుండొక వారము దినములు గోపాలపురమున జరుగు పాండురంగసప్తాహ మహోత్సవములను జూచి యానందింపుచు, యాత్రికుల భోజనసమపాయముల పరిమితజాగరూకతతో గావించి నందుకెంతయు నచ్చెరువందుచు, కిశోర భూపాలుడా చంద్రవద నునితో వేడుకగ కాలముగడిపెను.

తదనంతరము వారిరువురా జడదారింగాంచి నమస్కరించి, స్వామీ! యికమాకు శెలవొసంగుడు. ముంగుసంవత్సరమునజరుగు సప్తాహంబునకు నా ధనము వెచ్చింప నిండని కిశోరరాజుకోర, రాజా! నీవునాకు దానమొసంగినను, చంద్రవదను డిప్పవిచ్చునా? నేను చేపల్లో, చెట్లో, కొని మర్వనియోగ పరచెదనేమోనని చిరు నవ్వుతో బల్క నాచంద్రవదనుడు స్వామీ! నాబాల్య చాపల్య మున పల్కినపల్కులను పాటింపకుడు. మీ కొమరుడట్లు పల్కిన మీరు మన్నింపరాయని వేడుకొనెను.

బిడ్డలారా! మీపై నాకిప్పుడుండుకొన్న సంతోషముచే పరిహాసముగ నట్లంటిని. మీరును మీపట్టణమువదలి చాలాకాల మైనది. మీప్రజలు, అంతఃపురస్త్రీలు మీరాకకై ఆతురత జెందు చుండవచ్చును. మీ రేగుటకు నాయాక్షేప ణేమియు లేదు. కొంత కాలమునకు నేను సుగుణఘట్టమున కరుదెంతును. మీ రప్పుడు నాకు ధనమొసంగవచ్చును. పండరిపురమునను,గోపాలపురమునను

మీరింక చూడవలశిన దేమియుగాన్పట్టుటలేదు. మీ కేదేని యను మానమున్నయడల చెప్పవచ్చునన చంద్రవదనుడు స్వామీ! మన ముగోపాలపురమునుండి పండరికి పడవలో వెళ్ళిన నా గోపాలపుర పండరిమధ్య ప్రవహించు, నది అర్ధచంద్రాకారముగ కాన్పట్టెను. అందుచేత నేకాబోలు సుమా, దీనిని చంద్రభాగియనియందురు. నా యీతలంపు నిక్కవమాయనియడుగ నాయనా అవును, యీనది మార్గమందంతటను పలుచోట్ల పలునామములతో ప్రవహించి పండరియందుమాత్రము నీవనినట్లుచంద్రభాగియందు. యింకేమియు నుమానమనియడుగ కిశోరరాజు తండ్రీ! మేము మానిజరాజ్యము నకెట్లు చేరగలము? మాకడ నశ్వములు లేవు. మార్గమా, కడుదుర్గ మము, శీఘ్రకాలమునచేరు మార్గ మేదేనికలదాయని ప్రార్థింప బిడ్డలారా! నేనాసనుపాయముచేయకనే మిమ్ముపంపెదనా? నాబిడ్డ లువంటివారు మీరుకారాయని వారికి సమాధానమిడి, వెండియు నామహానీయునివద్దయుండిన నొకభరిణయందుండు రత్నమునుజూపి బిడ్డలారా దీనిని మీరు నాజ్ఞాపకార్థముగ గొనిపొండు. దీనిని భూమియందు పడనీయకుడు అట్లుజరిగించితి రేని యిక భూమినుండి మీరు వేరుపరచజాలరని యా రత్నమునుజూప, పట్టపగలే అట్ట హాసముగ మిట్టిపడి వెలుగొందు నారత్నమునుజూచి కన్నులు మిరు మిరలాడ నిక దానింజూడజాలకుండు టాజడదారిగాంచి దానినితిరుగ నాభరిణయందుంచెను.

అప్పుడా కిశోరసార్వభౌముడు స్వామీ! దీని గుణగణములె ట్టివి? యిది తమ రెట్లుసంపాదింపగలిగితిరి? దీనిచరిత్ర మేమనియడుగ

నాజడదారియగు విఠల్ దా సివ్విధంబున చెప్పఁదొడంగెను.

ఇచ్చటి కనతిదూరమునందుండు షోలాపురమనుపట్టణంబున యశస్ పాల్, సత్పాల్ అను నిరువురు సోదరులుగలరు. అగ్రజుడగు యశస్ పాలుడు చిన్నతనమునుండియు పాండురంగభక్తుఁడు. తానెల్లప్పుడును దైవచింతయందు కాలముగడుపుచుండెను. మరియు తానొక్క కాసైనను సంపాదింపడయ్యె. దానంజేసి చిన్నవాడగు సత్పాలుడు తానొక్కడే కుటుంబమును పోషింపజాలకనున్నా, భార్య చెప్పుమాటలచేతనున్ను, వానిని తనకుటుంబమునుండి వేరుపరచెను అప్పుడుకూడా భక్తుడగు యశస్ పాలుడు దైవచింతవలననే కాలము గడపుచుండెను. నేననిన వానికెక్కువప్రేమ. యెన్నియో సారులీ పండరికరుదెంచెను. వానియర్ధాంగియగు రుక్మిణీబాయి మహా పతివ్రత. భర్తచేయుచేష్టల కొవంతయు విసుగొందక కూలినాలివల్ల కొద్దియోగొప్పయో సంపాదించి తన భర్తకుపెట్టినపిమ్మట తాను నుభుజింపుచు కాలము బుచ్చుచుండెను.

సత్పాలుడు సహిత మన్నగారిని వేరుపరచినపిమ్మట పూర్వమువలె నార్జింపజాలక తానును అన్నగారివలె బీదవాడయ్యెను. ఆతనియర్ధాంగి రూకలుసంపాదింపనిది అతనికన్నముపెట్టిన పాపము నభోలేదు. అట్టులే ఆతడును కష్టించుచునేయుండెను.

వకానొకదినమున పండరిపురముననుండు విఠలేశ్వరుని దర్శింపకుతూహలముచే యశస్ పాలుడు తనయర్ధాంగియగు రుక్మిణీబాయిచే కొన్నిరొట్టెయల నాహారముకొరకుమూటకట్టించుకొని పాదచారుడైవచ్చుచు కొంతదూరము నడచినపిమ్మట వానినారగించుట

కొక వటవృక్షచ్ఛాయగల తటాకము దరికరుదెంచి కాలుజేతులా తటాకజలములచే శుభ్రపరచుకొని, తానుభుజింప నరుదెంచ నచ్చ టొక సువర్ణపేటిక కాన్పించెను. ముద్దుముచ్చటలు గొల్పు నాపేటి కను తెరచిచూడ కుతూహలముగల నాయశస్పాలుఁడది విప్పిచూ డగా ఆభరిణయందొక రత్నముఁగాన్పించెను. దానినాతఁడు తాకినం తనే అందుండి సుందరాంగులగు కొందరుస్త్రీలు బయల్పడి అందు లోనొకతె అమ్మహానీయునికి విస్తరాకువేసెను. మరొక యంగన యందు పంచభక్ష్యపరమాన్నములను వడ్డించెను. వేరొకస్త్రీ వల యునంత నెయ్యిని, పలహారములను వడ్డించి భుజింపుమనియెను.

దీనికా మహనీయు డాశ్చర్యముతో వానినొల్లక పుణ్యాంగ నలారా! మీరెవ్వరు? యివ్విధంబున జరుగ కారణమెద్ది? నాకుమీ చరిత్రఁజెప్పువరకు వీనినినేనొల్లనని భీష్మించుకొని కూర్చొనియుండ అందొకవారిజాక్షి భక్తాగ్రేసరా! నీభక్తికి రంగఁడు కడుంగడు సంత సించి యివ్విధంబునగావించె. మేము దేవతాస్త్రీలము. నీవుహాయిగ భుజింపుము. తమపరిసికీరత్నమహాత్మ్యం బెరింగించెదమన, నా యన ఘుడట్లు గావించెను.

తృప్తిగభుజించినపిమ్మట పుణ్యాత్మా! యియ్యది పాండురం గనిచే నీకు లభింపబడెను. దీనిమూతను తెరచి యందుండురత్నము నంటినంతనే యెన్నిలక్షలప్రజలకైనను, యేలాటి లోటుపాటులు లేక భోజనాదులొసంగగలము. మరల నాభరిణయందుండు రత్న మును రెండవపర్యాయ మంటగనే మేముఁదరము మాయమయ్యె దము. పిమ్మట నాభరిణనునీవు మూశివైచి జాగ్రతపరచుకొనుము.

యిట్లావస్తువు దశవర్షంబులవరకు నీకేవిధమగు లోటుపాటులు లేక జరుపగలదు. తదనంతరము దానిమహిమ మారిపోవుననెను.

అట్లైన తదుపరి నేమిజరుగునని యడుగ, యశస్పాలా! తదుపరి యీరత్నము సదాదేదీప్యమానముగ వెలుగొందుచుండును. యిదిభూమియందు పడినమాత్రముననే వెలుగు హెచ్చును. కాని, యిక భూమినంటుకొనిపోయి పెకళించినను రాదు. చితుకగొట్టినను పగులదు. యికమేమరిగెదము. తమరీరత్నము నంటుకొండు మేమదృశ్యమయ్యెదమన నాయశస్పాలుడట్లు గావించెను. దేవతాస్త్రీలందర దృశ్యులైరి. వెంటనేదానినాతడు మూశినైచి పట్టరానిసంతోషముతో వెనుకకుమరలి యింటికేగి దానిమహిమ తనయర్ధాంగియగు రుక్మిణీబాయికిజెప్ప నాధా, విఠలేశ్వరునకుమనయెడ నెంతటిదయ. వాస్తవముగ భక్తులశ్రేయోభిలాషి సుమా! యని, పరిపరివిధముల పాండురంగని కొనియాడెను.

మరియు దానిని పరికింప తనకు బుద్ధిపొడముచున్నదని తననాధునడుగ నాతడు,తన్వీమణీ అటులకాదు, నీవీతక్షణమే యీపట్టణమందెల్ల ప్రజలను మనయింట విందారగింపచాటబంపుము. అప్పుడునీవు యీభరణిమహాత్మ్యమును గాంచవచ్చునన, ఆపెయునట్లు గావింపజేసెను. పట్టణమందెల్ల ప్రజలును కడుంగడు నిరుపేదయగు యశస్పాలుడిట్లు విందొనర్చుట కాశ్చర్యము నొందుచు, వానిని పరీక్షింప పట్టణమందు, బిడ్డలుమొదలు వృద్ధులవరకు బంతులుదీరి భోజనాదుల కెదురుజూచుచుండిరి. అప్పుడే రెండుఝాములు కావచ్చినది. యింట వంటప్రయత్నములేమియు లేవయ్యె. విందారగిం

షవచ్చినవారిలో కొంద రాతఁడు మనలనుపరాభవింప నిట్లుగావించె ననియు నా స్తవముగ మనల నిట్టులె అవమానపరచిన నీతనికి తగిన ప్రాయశ్చిత్తముచేయవలెనని గుసగుసలాడుచుండిరి. తనసోదరుడగు సత్పాలుడు వింహారగింపవచ్చిన వారిలో యేకీభవించి అన్నగారిని పరాభవపరచుటకు భార్యచెప్పుమాటలకు లోనై యుహూ్రిత లూగుచుండెను. అకాలమగుచున్నది వడ్డనలు ప్రారంభింపుడని జనసమూహామునుండి కేకలు వినుపించుచున్నవి.

అప్పుడాభక్తాగ్రేసరుడగు యశస్పాలుడు ప్రజలందరికి నమస్కరించి అయ్యలారా, శాంతింపుడు క్షణమాత్రమున మీకు వడ్డించుట ప్రారంభమగునని లోనికేగి పాండురంగనిమదిలోదలంచుకొని తనకా రంగనివల్ల ప్రసాదింపబడిన పేటికందెరచి అందుదేదీప్యమానముగ వెలుంగుచున్న రత్నమునుముట్టుకొనెను. వెంటనే యారత్నమునుండి లెక్కకుమిన్నయగు స్త్రీరత్నములుబయల్పడి తలవనితలంపుగా బంతులుతీరియున్న పురవాసులకాకులు వేసి వడ్డించుట ప్రారంభించిరి. పంచభక్ష్యపరమాన్నములతోసహా కడుపార నాపట్టణప్రజలను భుజించువట్లుజేసి తాంబూలాదులొసంగి నాదేవతాస్త్రీలందరుయింటిలోనికరిగి యశస్పాలా! యిక మేమరిగెదము మణి నంటుకొనుమననాయనఘుడట్లుగావించెను. వెంటనేవారందరదృశ్యులైరి.

పట్టణవాసులంద రాశ్చర్యానందపరవశులైరి. సోదరుడగు సత్పాలుడు తలనేలజూడ నచ్చటనుండి వెడలిపోయెను. యశస్పాలుడట్లు గావించుటజూచి తననారీమణి యా మణిప్రభావమున కెంతయు తనభర్తభక్తిరసమే కారణమని నుబ్బుచుండెను.

• • • సత్పాలుడు తానునొక మణిని సంపాదింపవలెనని యాశతో భార్య చెప్పిన మాటలచొప్పున తానొక యరణ్యమధ్యంబున జేరి భగవద్ధ్యానమొనర్ప యశరీరవాణి, భక్తాగ్రేసరా! పాండురంగడు నీభక్తికిసంతసించి గాబొలొక మణినీకు ముందుభాగమునపడవైచె నని పల్క నాసత్పాలుడు కన్నులుతెరచి యెదురుగ నట్టహాసముగ గాన్పించుచున్న భరిణను చేనంది కన్నులనద్దుకొని తక్షణమే షోళా పురమునకేగి తానును, తనయన్నగారివలె పట్టణవాసు లందరిని విందారగింపరండని చాటనంపెను.

పూర్వము పిండివంటలు, క్షీరాన్నము సహితముగ నార గించినందున చుట్టుపట్లవారినికూడా తమతోవచ్చునట్లేర్పరచుకొని అట్టహాసముగ విందునకు సిద్ధపడిరి. విందునకరుదెంచిన వారిలో డాంబికులందరకాలమైనదని కేకలిడిచుండిరి. చంటిబిడ్డలు తమతమ తల్లులవద్దనల్లరిజేయుచుండిరి. కొంటెపిల్లలొకరినొకరు తోశికొను చుండిరి. యిట్టిసమయమున సత్పాలుడర్ధాంగి సహితముగ నచ్చొ టొకవేదికపై నెక్కి పజలను నిశ్శబ్దముగ నుండుడనిసైగఁజేసి, పుర వాసులారా! నిమిషమాత్రమునమీకు వడ్డించుట ప్రారంభమగు నని జెప్పి లోనికేగి పాండురంగనిధ్యానించి భరిణను తెరచెను.

అందుండివేనకువేలు పురుషులు తమతమ యాయుధముల తోబయల్పడి కదలనివ్వక తలకునలుగురు చొప్పున నిమేషమాత్ర మున శుభ్రముగ యింటివారి సహితముగ విందారగింప వచ్చిన వారికి క్షురకర్మనొనర్చి మాయమైరి. వోర్వలేనితనము వానినట్లు గావించినది.

తనతమ్ముడట్లుగావించినమరునాడుదయమేభక్తుడగుయశస్ పాలుడు రుక్మిణీబాయిసహితముగ పండరికిపయనమైనాకడకరుదెంచి, మణిప్రభావమును నాకెరింగించి, స్వామీ! మీరుదీనినితమచేతీరున సార్థకపరచెదరో, మీయిచ్ఛవచ్చినట్లు సద్వినియోగపరచుడని దీనినినాకొసంగి వారును నాకడనే పాండురంగనిధ్యానింపుచుకాలముగడపి యిటీవల నదేమిచిత్రమోవారిరువురొక్కపరియేకాలధర్మమొందిరి.

నాటినుండియు యీరత్నసహాయ్యమున నేను నిత్యమన్నదానమొనర్చుచు దశవర్షంబులు గడపితిని. తదుపరిదీనిపటుత్వము క్షీణదశకొచ్చి నానాటికి పదిమందికైనను భోజనాదు లొసంగజాలక యెట్టకేలకదియుంగూడ నశించెను.

నాడామహనీయుడనినట్టీ రత్నము వెలుంగునకు మేరలేదు. కావున కిశోరసార్వభౌమా! దీనిని మీయిచ్ఛవచ్చినట్లు వినియోగపరచుకొమ్మని సుగుణఘట్ట పురాధీశ్వరున కొసంగెను.

వెండియు బిడ్డలారా! మీరిప్పుడు సుగుణఘట్టమున కరుగునట్లొక్క క్షణమాత్రమున నొనర్చెదను యిరువురొకేపర్యాయము కన్నులుమూసుకొండనిన మంత్రిపుంగవుడగు చంద్రవదను డమ్మహాత్మునకునమస్కరించి స్వామీ! అట్లుకాదు మాయశ్వములానాడరణ్యమధ్యమున నొకకాపువానిపోషణకింద యుంచి వచ్చితిమి. వానినారోహించి పట్టణముజేరవలయునని కుతూహలముగ నున్నదట్లుగావింపమనివేడ నాజడదారియగు వృద్ధుడట్లులేగావించెను.

కన్నులు తెరచిచూడ పూర్వము వారిరువురు బసజేసిన యాయరణ్యప్రాంతమునందుండిరి. దానికివారెంతయునచ్చెరువొందిరి.

చంద్రవదనుడు మెలమెల్లగ తన యెడమచేతియందా రత్న పేటికనుంచుకొని కడమచేతితో కిశోరుని కేల్బట్టి తమ యశ్వము లుండు గోకులకేగి యాకాపును దర్శించెను.

సుగుణశోభిగు నాకాపు వారి రాకకెంతయు సంతసించి చంద్రవదనునిగాంచి, నాయనా! నీవెట్టులిమ్మహనీయుని గాంచితి వని యాతురతతో నడుగ జరిగినదంతయు నా కాపున కెరింగిం చెను. యింతలో వంటతయారుచేయించి నాటికి హాయిగ వారికి విందొసంగి ధనసహితముగ వారిగుర్రముల నప్పగించెను.

దినములుగడచినను విశ్వాసముగల నాయశ్వములు సకిలిం చుకొనుచు యువరిగుర్రము వానియొద్దకువచ్చి నిలువంబడెను.

దానికా రాజమంత్రులిరువురపరిమితానందము నొందుచు, యాకాపునుగాంచి, నీసహాయ్యమపారము. నీమేలెన్నడును మేము మరువజాలము. నీకేమికావలయునో కోరుకొమ్మనిన, మహాత్మా! మీరెప్పుడును పట్టణవాసులు మేము సదా అరణ్య మధ్యమున నుండువారము యీరత్నము మీరానాడు మకాముజేసిన ప్రాంత మునస్థాపింపుడు. ప్రియాణీకులకేగాక సాధుమృగములకు సహిత మెంతయు సహాయ్యముగనుండునన, వారట్లపరిమిత సంతోషమున గావించిరి.

కాపువాడాశ్చర్య మింతింతయని చెప్ప నలవిగాదు. క్షణ మాత్రమున భూమినంటుకొనిపోయి వెలుంగు రత్నసహాయ్యమున నిశలయందుసహిత మిచ్చట సుఖముగ కాలము గడపుకొనుట కెంతయు నాతనికి సహాయ్యపడెను.

కిశోరచంద్రవదను లశ్వరూఢులై పట్టణము నతిశీఘ్రముగ

చేరుకొని తమతమసతులకు, ప్రజలకెంతయు నానందము గూర్చిరి. వుదారశింహుడు పరిపాలనా భారమప్పుడే కిశోర చంద్రవదనుల కప్పగించెను.

ధనాగారబీగములు వేరుగ శృష్టింపంజేసిరి. ధనములకు వడ్డీలను చేర్చి విజయరాజపురమునకంపి నాడు కుదువగనుంచిన చంద్రవదనుని సువర్ణ మొలతాడును తెప్పించుకొనిరి.

వీరుపడిన కష్టములన్నియు పూసగుచ్చినట్లు అంతఃపుర స్త్రీలతో గుండియలు తల్లడిల్లంజెప్పిరి. వుదారుడాశ్చర్యమొందెను.

నాటంగోలె సుగుణఘట్టమునందు చక్కగ రాజ్యమును పాలింపుచు, బహుకాలము ప్రజలమన్ననలంబడసిరని చెప్పుచుండగనే దివాకరుడు తనప్రయాణ మతిశీఘ్రముగ సాగింపుచు, విజయవర్మ, మణికంధరులను వ్యాఖ్యానము జేయుచున్నాడో యనునట్లు పారుడు త్రుళ్ళిపడిలేచి, మణికంధరా! ఆనాడు సుగుణఘట్టపురాధీశ్వరునివల్ల స్థాపించి పాండురంగని మహిమచే యశస్పాలునికి లభించిన రత్నమేయియ్యది. కాలాతీతమైనది. విశేషకాల మిచ్చట నుండతగదన మణికంధరుడారత్నమహిమకు పాండురంగనిమహాత్మ్యమున కాశ్చర్యమగ్నుడై భూసురోత్తమా, నాడువిజయరాజపురాధీశునివద్ద కొంతధనమిా కిశోరరాజుతీసుకొనియుండెను. దానినెవ్విధంబున వారికిచ్చిరనియడుగ, బాలకా! ఆనాడశ్వరూఢుడై సుగుణఘట్టమున కరుదెంచిన వ్యక్తి కుదారశింహుడిచ్చిన నూరువరహాలవియేయని చెప్పగా తృప్తిజెంది విజయవర్మవెంట బయలుదేరి పర్వతములు,గుట్టలు,అరణ్యముల న్చక్కగడపి రెండవమజిలీ చేరెను.

